శ్రీరస్తు.

శ్రీకృష్ణపరబ్రహ్మణే నమః.

# రుక్మిణీపరిణయ కావ్యము

అను నీ గ్రంథము

శ్రీవేంకటగిరి సంస్థానాశ్రిత

మణిగొండ వేంకటరమణ కవిచే

సంస్కృతము[illegible]డి యాంధ్రీకరింపఁబడినది.

చెన్నపురి.

చదలువాడ సుందరరామశాస్త్రులవారి

శారదాంబావిలాస ముద్రాక్షరశాలయందు

ముద్రింపించి ప్రకటింపఁబడినది.

1911.

శ్రీరస్తు.

## రుక్మిణీపరిణయకావ్య

# విషయసూచిక.



రుక్మిణీపరిణయకావ్య విషయసూచిక

సంపూర్ణము.



శ్రీరస్తు.

శ్రీప్రసన్న పాండురంగ విఠ్ఠలేశాయ నమః.

# రుక్మిణీపరిణయ కావ్యము.

శ్లో॥ శ్రీమత్కోదణ్డపాణివ్యాసపూర్ణప్రియాభిధశిష్యం మద్గురువర్యం
శ్రీమత్సర్వజ్ఞసచ్ఛాస్త్రిత్కరామ్భోజషట్పదముద్యత్సత్త్వగుణాఢ్యమ్
శ్రీమత్పణ్ఢరిపురీశారాధనాలోలచిత్త మహం వన్దే సుశుభార్థే
శ్రీమన్నాగేశ మార్యం మూళగిర్యన్వయామ్బుధిచన్ద్రం సద్గుణసాన్ద్రమ్.

( మంగళాచరణము. )

శా. శ్రీరామాశుభదేక్షణోత్పలదళ♦శ్రీదాయి సత్యాశ్రయుం
డారాజచ్ఛుభలక్షణాంచితుఁడు రా♦ధాంచచ్చకోరీమహా
దారుం డాహరివక్త్రచంద్రుఁ డను వాం♦ఛన్ రాజగోపాలకృ
ష్ణా రాజోత్తమ యాచభూప నిరతా♦హ్లాదంబు నీ కిచ్చుతన్. ౧

ఉ. తాలిమి నాథువక్షమునఁ ♦ దా దయఁ బొల్పున నిల్చి భక్తదో
హాలి గణింప నీయక శు♦భావలిఁ గూర్చుచు నాథు నెప్పుడుం
బోల వనన్యయోగ్యగతిఁ బూజ ♦ లొనర్చెడు లక్ష్మి రాజగో
పాలకృష్ణయాచనర♦పాల శుభం బిడు నీకు నిచ్చలున్. ౨

సీ. సమడంగవేదోక్తి♦చతురాస్యుఁ జతురాస్యుఁ
బాలితసర్వగీ♦ర్వాణి వాణిఁ
దతచరాచరజగ♦త్ప్రాణుఁ జగత్ప్రాణుఁ
బావనగుణమణిఁ ♦ బవనురమణి

శేషిసత్తల్పవి♦శేషాత్ము శేషునిఁ
బరిహృతవృషగర్వుఁ ♦ బక్షివర్యు
సద్భక్తజనమన♦శ్శంకరు శంకరు
రుద్రునిభామఁ గా♦త్యాయనీమ
వరుస విఘ్నేభపంచాస్యు ♦ వరగజాస్యు
వ్యాసవాల్మీకిముఖ్యగీ♦ర్వాణకవుల
నమర నన్నయపోతనా♦ద్యాంధ్రకవులఁ
దలఁచి మ్రొక్కెద మత్కృతి ♦ తనరుకొఱకు.

సీ. వివిధసాంగోపాంగ♦వేదస్వరూపతా
సుభ్రాజి తిక్కన♦సోమయాజి
కవితాప్రవీణతా♦కలనకావ్యవినుత
స్తుతిరాజి తిక్కన♦సోమయాజి
హరిహరనాథాఖ్య♦పరతత్త్వసేవనా
సుఖభాజి తిక్కన♦సోమయాజి
వేదాంతవిద్యావి♦వేకజితాబ్జజ
సుతరాజి తిక్కన♦సోమయాజి
వ్యాసవాల్మీకిరచితగీ♦ర్వాణభార
తోత్తరరఘూత్తమచరితాం♦ధ్రోక్తివిరచ
నామశ్రీవిరాజి తిక్కన♦సోమయాజి
మించి నామదిఁ గృప వసి♦యించుఁ గాత. ౪

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును సుకవిజనవందనంబునుం గావించి,

సీ. మహితవిద్యాప్రౌఢి♦మవిజితఫణిరాజు
వాదిరాజు జితాన్య♦వాదిరాజు

# రుక్మిణీపరిణయకావ్యము.

హయవదనప్రసా♦దాసాదితాఖిల
విద్యాసమార్జిత♦విమలకీర్తి
క్షమ రుక్మిణీశవి♦జయమహాకావ్యంబు
దేవభాష. రచించెఁ ♦ దివిరి యందుఁ
బరికించి రుక్మిణీ♦పరిణయభాగంబుఁ
గొని తెనిఁగించెదఁ ♦ గోమరు మిగుల
రాజగోపాలకృష్ణుండు ♦ రమణఁ గథకు
నాయకుఁడు గాన నొనరింతు ♦ నాయకునిఁగ
రాజగోపాలకృష్ణుని ♦ రహిని గృతికి
సరసు లెల్లరు తగు నని ♦ సమ్మతింప.

సీ. ఆత్రేయగోత్రప♦విత్రుఁ డాపస్తంబ
సూత్రుండు మధ్వార్య♦సుమతజనితుఁ
డల మణిగొండవం♦శాంబుధిచంద్రుఁ డౌ
కృష్ణార్యసూనుండు ♦ గృష్ణభక్తుఁ
డెన్న మూళిగిరినా♦గేశార్యశిష్యుఁ డౌ
నన నెగడినవాఁడ ♦ నట్టి నేను
వేంకటరమణాఖ్య ♦ విదితుండను బ్రసన్న
పాండురంగకృపావి♦భాసితుండ
రహిని రాళ్ళపల్లి♦రాఘవార్యుఁడు బుధ
వరుఁడు ప్రీతిఁ దోడు♦పడఁగఁ గడఁకఁ
దెలిసినంతవట్టు ♦ వలికెద నీకృతిఁ
బ్రోవఁ గోరువాఁడ ♦ బుధులఁ గవుల.

సీ. లక్ష్మీసరస్వతుల్ ♦ లక్షింప నిచటన
కలిసి యుండుట చూడఁ ♦ గంటి మనుచు

ఘాన్వింద్రు రోమలు ♦ భావింప నిచటన
కలిసి యుండుట చూడఁ ♦ గంటి మనుచు
దండధరేంద్రుల ♦ ధర్మంబు లిచటన
కలిసి యుండుట చూడఁ ♦ గంటి మనుచు
విత్తేశబలివిభుల్ ♦ ఖత్తుగ నిచటన
కలిసి యుండుట చూడఁ ♦ గంటి మనుచు
బుధులు పొగడ విద్యాధనం ♦ బులును వీర్య
కీర్తులును దండరక్షణ ♦ కర్తృతయును
గలిమి యీవియుఁ దమయందుఁ ♦ గలసి వెలయ
వఱలు చుందురు వెలుగోటి ♦ వంశ్యనృపులు.

వ: అందు.

సీ. ఏమాన్యప్రపితా ♦ మహుండు హరిహ
రాలయ నిర్మాత ♦ యై నుతిఁ గనె
నేమహామహుప్రపి ♦ తామహుండు రథాళిఁ
దిరువీధుల రచించి ♦ తేజరిల్లె
నేమహీనాథుపి ♦ తామహుం డల స్వర్ణ
నాముఁడై సార్థక ♦ నాముఁ డయ్యె
నేరాజవరుతండ్రి ♦ యొసఁగ సర్వజ్ఞాఖ్య
సార్థకంబుగ భువి ♦ సరవిఁ బొల్చెఁ
బుత్త్రపౌత్త్రానుజాతస ♦ న్మిత్త్రబంధు
యుక్తి నెవ్వండు ధర నేలు ♦ చుండు నతఁడు
వఱలు వెలుగోటిరాజగో ♦ పాలకృష్ణుఁ
డల మహారాజబిరుదుండు ♦ యాచవిభుఁడు.

ఉ. శ్రీలసితుండు వాక్ప్రియుఁడు ♦ చిత్తజవర్ధనమూర్తి దుస్తమో
వ్యాలవిపుండు రాజు విబు ♦ ధావనుఁడున్ సమవర్తియున్ రసా
ఘూలయమున్ ధనేశ్వరుఁడు ♦ సౌ ఖ్యని త న్నృఘు లెన్న రాజగో
పాలకకృష్ణయాచవర ♦ పాలకుఁ డేలు మహిన్ శుభోన్నతిన్. ౧౧

(షష్ఠ్యంతములు.)

క. ఏవంవిధగుణతతికిని, శ్రీవనజాక్షాంఘ్రిపద్మ ♦ సేవారతికిన్
సేవితగౌరీపతికిని, బావనసుకృతికి నితాంత ♦ వరశుభవృతికిన్. ౧౨

క. హరిహయజనయుతహయునకు
హరిహయవరహస్తిసత్వ ♦ హస్తిచయునకున్
నరపాలననిపుణునకును
నరసారథిచరణశరణు ♦ నకు సుగుణునకున్. ౧౩

క. గురుధైర్యమేరునిభునకు, వరవేంకటగిరిపురాధి ♦ పప్రభునకు శ్రీ
కర వెలుగోటిసువంశీ, య రాజగోపాలకృష్ణ ♦ యాచవిభునకున్. ౧౪

(కథాప్రారంభము.)

వ. అంకితంబుగా నారచియింపఁ బూనినరుక్మిణీపరిణయ కావ్యంబునకుఁ
గథాక్రమం బెట్టి దనిన. ౧౫

క. వరవేంకటగిరినాయక, వర పంచసహస్రసైన్య ♦ పతి వినుతగుణా
కర వెలుగోటిసువంశీ, య రాజగోపాలకృష్ణ ♦ యాచమహీశా. ౧౬

వ. అవధరింపుము. ౧౭

(ద్వారవతీపురవర్ణనము.)

క. సకలైహికవిభవాము
త్రికసౌఖ్యద్వారభూతుఁ ♦ గృష్ణుఁ బడయుటన్
బ్రకటితమై రాజిల్లెను
నాకపురి ద్వారవతి నాఁగ ♦ నొప్పుగ జగతిన్. ౧౮

క. ద్వారవతి యనుచుఁ బిలుతురు
వారక స్ఫాటికకవాట◆వగపిహితలస
ద్ద్వారవతి సదావివృత
ద్వారవతిఁగ మదిఁ దలంచి◆యారయువారల్. ౧౯

తే. గీ. అరయ వివృతంబ యయ్యును◆ద్వారచయము
వరమనోజ్ఞహరిన్మణి◆ద్వారబంధ
కాంతిచేఁ బిహితంబుగఁ◆గాన వచ్చు
దాన నెటు లెన్న నగు దాని◆ద్వారవతిఁగ. ౨౦

ఉ. రాజితనైజసౌధనిక◆రద్యుతి క్షీరధిఁ బోలుసీరధిన్
భ్రాజితశేషముఖ్యపరి◆వారవృతం బయి దుష్టదూరమై
తేజరిలుం గణింపఁ దెలి◆దీవి యనన్ నిజదీప్తి నెంతయున్
దా జగమందుఁ దత్పుర ము◆దారత మాధవసన్నిధానమై. ౨౧

మ. అరిసేనాను లనేకు లాపురి జిగీ◆షాయత్తులై చేరుచో
వరజాంబూనదవప్రరత్నరుచులన్◆భ్రాంతిన్ స్వరూపంబులన్
శరఖడ్గాదికపాణులం గని భయో◆చ్ఛ్వాసంబులం బాఱఁ జొ
త్తురు వేగన్ బ్రతియోధులంచు దిశలన్◆దోడ్తోఁ బరుల్ నవ్వఁగన్

తే. గీ. లలి సుముక్తాళిరాజితా◆లయయు నిత్య
సత్యసత్ప్రమోదాశన◆సత్సమూహ
శౌరిదయిత దుష్టాగమ్య◆ద్వారక యది
యుల్లసద్వైకుంఠ మనఁగ నొ◆ప్పారె జగతి. ౨3

క. రత్నావృతవరగోపుర, రత్నావృతవప్రసౌధ◆రత్నగృహావళీ
రత్నావృతతన్నగరీ, రత్నాప్తిం బయోధి యొప్పె◆రత్నాకరమై.

క. ముక్తాళు లలల సాగర
ముక్తసుతై చేయుచుండుఁ◆బురి గుఱు సేవన్

ముక్తాళులు భవసాగర
ముక్తము లౌచును వికుంఠ ♦ పురిఁ జేరుక్రియన్ ౨౭

క. ధర వణిజులు ముక్తాప్తికి, వరపోతము లాశ్రయించి ♦ వత్తురు పురికిం
బరసిద్ధులు ముక్తాప్తికి, హరిపదపోతంబుఁ జేర ♦ నరుదెంతురటన్.

తే. గీ. అల హరిపురంబు పరిధీకృ ♦ తాంబుధి యిత
రుల కగమ్యం బని విని ని ♦ రూఢచింత
చే జరాసంహితశరీర ♦ సీముఁ డగుచుఁ
దనదు పేరు మాగధుఁడు సా ♦ ర్థకము సేసె. ౨౮

తే. గీ. ఘనతఁ గావ్యోచితశ్లోక ♦ కాంక్ష భావ
విదులు బుధులు వదాన్యులు ♦ పదపదములఁ
గడఁక విద్వజ్జనానంద ♦ కరవరార్థ
ముల విచారించు చుందురు ♦ మురరిపుపురి. ౨౯

ఉ. కూరిమి శంకరుండు జన ♦ కోటి కొసంగెను నే మహాత్మున
త్తారకమంత్రరాజమునఁ ♦ దద్దయు నెవ్వని పాదవారిచే
సారతరంబుగా నెగడ ♦ సాగెను గాశిక యట్టి శౌరి తా
నే రహి నిల్పె ద్వారవతి ♦ నెన్నికఁ గాంచదె యద్వితీయమై.

మ. నగరీవారవధూరథస్థుఁ డయి కం ♦ దర్పుండు భ్రూచాపమున్
దగ సారించి కటాక్షనీలనళినా ♦ స్త్రవ్రాతముల్ గ్రుచ్చి బల్
వగలం బాంథులఁ గట్టుమందు స్మితరు ♦ క్పాశంబులన్ బ్రోద్ధతిన్
మొగి నెన్నంగ సమానులున్ వికలులై ♦ మోహాప్రవృతుల్ గా వేడ్కన్.

తే. గీ. ద్వారక స్వగోపురాఘక ♦ రాళి దివము
దాఁటు నందేమి చిత్రము ♦ తత్పురి తన
యంతరంగంబున ముకుందు ♦ సకలతీర్థ
రాజములఁ గల్గి తత్సేవ ♦ రాజిలుటను. ౩౦

సీ. వరయోగిజనులల్లఁ ♦ ద్వారక హరిజప
బ్రహ్మాస్త్రధారులై ♦ రత్యధీశు
ధనువును బుష్పకృ♦తంబుగాఁ దద్వర
బాణాళిఁ బంచస్వ♦భావముగఁ
దత్సచివుని వసం♦తం వసంతం వశ్య
యనుచు నప్పుడటుగా ♦ నతనిమిత్రు
క్షయభాజనునిఁ గాఁగఁ ♦ గణిమిఁ దదనుగుల
మాధుర్యగుణ్యవా♦క్సహితములు గ
వరుసఁ దత్సేన నబలలై ♦ పరఁగునటులు
పౌనర వాని ననంగీకృ♦తునిఁగ నిటులు
నిశ్చలాత్మకులై స్మర♦నిం బరాజి
తునిఁగఁ జేసి చరించు చుం♦దురు తపముల. 3౨

తే. గీ. ఎనయ మన్మథు నబలు జ♦యించి యతని
దయిత శ్రీకృష్ణునను శ్రీ♦దయితపాద
వనరుహధ్యానమాత్రస్థ♦ నొసరిచి పురి
యతులు విహరింత్రు కామజ♦యైకలీల. 33

మ. స్మరునిం దర్పకుఁగాఁగఁ దక్షితు జగ♦త్సమ్మోహకుంగాఁగఁ ద
ద్వరసేనం బ్రమదాళిఁగాఁగ సుమనో ♦ భావ్యంబుఁగాఁ జాపమున్
శరరాజిన్ విషమంబుఁగాఁగ సుమన♦స్సంసేవ్యుఁ గా నూతు నెం
చి రమించుం బురిఁ గాముకాళి తగఁ ద♦త్సేనావశస్వాంతమై. 3౪

తే. గీ. అమలమాల్యానులేపనా♦రాంబరములు
సెలఁగ వారాంగనలు శుచి♦స్మిత లరుగఁగ
యామికులు నుదితేందు తే♦జోతిరిక్త
లగుట గుర్తింపఁగా నేర♦రైరి పురిని. 3౫

మ. వరశాస్త్రంబులు విన్చుఁ బాడుచు మదిన్ ♦ భావించుచుం భక్తిఁ ద
చ్చరణాబ్జంబులఁ గొల్చుచున్ సతతమ ♦ ర్చల్ సేయుచున్ దాస్యముం
గరిమం జూపుచు సఖ్యముం గొలుపుచున్ ♦ గామించియాత్మార్పణం
బు రహిం జేయుచు నెంతు రల్లపురిఁ బెం ♦ పుం బొంది కృష్ణార్చకుల్.

మ. తగుతద్వప్రబహిర్గతాబ్ధి జలము ♦ గ్రత్తాంబులన్ స్వాతిఁ బెం
పు గనన్ శుక్తిపుటంబులన్ జరగఁగన్ ♦ ముక్తామయంబై రహిన్
దగ హస్తాబ్జపుటాళిఁ గృష్ణజలము ♦ గ్రత్తార్ఘ వార్యాప్తిఁ బెం
పు గనన్ విప్రకులాబ్ధి తజ్జ్ఞగణమున్ ♦ ముక్తామయంబై బలే. ౩౮

తే. గీ. పురి సుధర్మ పుంజూపన ♦ మూలభూతుఁ
గృష్ణునిఁ గృతాధివాసుఁ గా ♦ నెఱఁగి యింద్రుఁ
డాత్మ పురిగతి సభకు నా ♦ నను భయమున
స్వసభ నలసుధర్మాఖ్య నొ ♦ సంగె హాకి. ౩౯

మ. స్వసుతుంగోర్మికరానుషక్తవిలస ♦ చ్చక్రాంకశంఖాంచితుం
డు సురత్నావృతగాత్రవాస్యనిమిషుం ♦ డున్ ఫేనలేపాంగుఁడై
పన స్వాసక్త జలౌఘపాపహరుఁడౌ ♦ ప్పన్ యోగిబాహ్యోత్సవుం
డు సముద్రుండు పురంబుఁ బ్రోచు నలకృ ♦ ష్ణుం బోలుచున్ జేరువన్.

మ. పురి నచ్చక్రగరాళిపుష్టకటకన్ ♦ భోగీంద్రభోగాస్పదన్
వరదృక్స్థానగతేందిరన్ గనకస ♦ ద్వప్రాతిపీతాంబరన్
గురుతన్ స్వోదరవాసిహంసగమనన్ ♦ గోత్రాసుధర్మావహన్
బరమాకార సముద్రమధ్యగ సురల్ ♦ పద్మాధరాలింగితన్. ౪౦

క. పురి యంగనాలమును ముఖ
సరసిజము దరస్మితమధు ♦ నరన మలకబం
భర మంగనాస్మరాస్త్రో
త్కరము కలిదు విశ్వమోహ ♦ కర మగు సెప్పదున్. ౪౧

క. కలశాలికంఠసంచయ
విలసచ్ఛుభదకమనీయ♦వివిధోన్నతస
త్కలశాలికంఠసంచయ
విలసితగృహనికర మగుచు ♦ వెలయుఁ బురి రహిన్. ౪౨

ఆ. వె. పరమ మాశ్రమంబుఁ ♦ బురిఁ బొంద రమ సర్వ
దానములను సర్వ♦దాజనములు
తృప్తి నొందు చెలమి ♦ దివిని బోలఁగ శ్రమ
మెఱుఁగ కుందు రచట ♦ నెల్లగతుల. ౪౩

తే. గీ. ధరణిఁ గాశిక శ్రుతిసంగ♦తస్వకోటి
మాత్రగుణముచేఁ బురికి న♦మ్రముఖ యగుచు
వడి నవద్యసంఛాదన♦వైఖరిజ్ఞ
కాన ధరియించె ధనురను♦కార మమర. ౪౪

చ. తతవరభిత్తిరత్నఫలి♦తప్రతిరూపవిచిత్రచిత్రమా
నితములు వాసుదేవగృహి♦ణీగృహముల్ నవరత్నరోచులన్
సతతము రంగసంచయసు♦సంగముగన్ రమణీయ మాప్రదే
శతతి ధరించెనో యనఁ బ్ర♦జానయనోత్సవకారు లొప్పఁ బురిన్

మ. ప్రియనృత్యం బొనరించు కేకితతిచేఁ ♦ బెం పొందు సౌధంబులం
బ్రియ మారన్ రుచిరాద్రిశృంగమతితో ♦ వే ప్రాలుచుం జెంత నా
రయఁగాఁ దమ్మును గ్రమ్మునీరధరగా♦త్రంబుం దగం జిమ్మెడున్
రయ మారం బురి కేతువ్రల్ నిజపట♦ప్రాతానిలప్రాహతిన్. ౪౫

చ. విమలమహాసువర్ణవర♦వేష్టనముల్ ద్యుతిదీపితాభ్రవి
ద్రుమహరినీలముఖ్యగుణ♦ధుర్యవినూత్ననవోరురత్నశో
భి మహితసౌధశీర్షమును ♦ వింత మహిం గపిశీర్ష మన్నవా
మమునను బిల్వఁగా బుధులు ♦ మానవవీథి సహింప రాపురిన్.

క. సరవలు విలసద్ధారను
సరసారశిరోధర లగు♦సరసిజవదనల్
వరనయనై పుణ్యానయన
సరసిజజితపురుషవరలు ♦ చరియింత్రు పురిన్. ౪౮

తే. గీ. తగ నవనవోష్ఠదంతతు♦తములఁ జూచు
సవతికి దురంతచింతను ♦ యువతి కన్య
కద్ది దాఁచ నేరమిని దు♦రంతచింత
నిట్టు లాపురి ఫలసామ్య ♦ మిచ్చు చూడు. ౪౯

(రుక్మిణీపత్త్రిసందేశ వర్ణనము.)

క. అంబుజనయనుఁ డెలమి నన
యంబు జనంబులను బ్రోచు ♦ చాప్తులతో నా
యంబుజనితపురి నిండుప్రి
యంబు జనింపంగ నుండు♦నంత విదర్భన్. ౫౦

క. అంచితగతి భీష్మకసుత
పంచాగ్రగజయుక్త యొసఁగి ♦ పత్త్రి యొకద్విజుం
బంచాస్త్రిమాత రుక్మిణి
పంచెను హరికథకు నన్న♦వంచన విని తాన్ ౫౧

వ. ఇట్లు పంచి కృష్ణు నుద్దేశించి తనమనంబున. ౫౨

మ. అల భక్త్యంగనఁ గూడి దృగ్ఝషము నా♦ధ్యావర్తముం బాశిప
జ్జలజంబుల్ శ్రవణ ప్రసాదంబు దరహా♦స స్నిగ్ధ ఫేనంబు న
వ్వలినుభ్రూమహితోర్మి కేశచయశై♦వాలంబు ౕ పొల్చువి
త్తలపద్మాకరమందు చిత్తనృప క్రీ♦డల్ సేయు మశ్రాంతమున్. ౫౩

మ. ఇను హస్తాబ్జము విశ్వలాంఘ్రియభిధునిన్ ♦ దృక్కైరవంబా తదా
ప్యవి శేసున్ జలధి త్తచోర యులకా♦ఖ్యధ్వాంతమున్ జహ్వాయన్

ఘనమందూకమ తత్కథాజలధి వక్షం బర్కకవాటంబ యా
తనిహృద్గేహము నచ్ఛకోదితము శ్రోత్రంబా విడం బోకుడీ.

మ. విను భ్రాంతాత్మ వినింద్యజంతుశతమున్ విణ్మూత్రపాత్రంబునై
చనుమర్త్యాధమగాత్రమందు రతి నోజన్ పీనుమా విశ్వలే
శుని నీలోత్పలవర్ణు నిత్యు స్వవశున్ శుద్ధాత్మునిం జేరు ప్రీ
తిని వే నిర్మలవిగ్రహున్ వ్రజవధూతృష్ణాసముజ్జృంభకున్. ౫౬

శా. నాలీకాననమారశంభువిలసన్నానా కాలయప్రస్తుతున్
మాలాలంకరణప్రభాపహృతసన్మాన్యాంతరగ్రంథినిన్
గాలీయాహిమదాపహారి మురలీగానాఢ్యు గోపాంగనా
లోలాత్ముని విను వంగ బోకు మనసా లోకేశుఁ గృష్ణున్ హరిన్.

వ. ఇట్లయ్యంగనామణి యయ్యనంగపితం దలంచుచుఁ దదాయత్త
చిత్తయై యుండ నట మున్న గృహీతపత్త్రుం డగు నమ్మేదినీసురుండు.

క. అది గాని ద్విజుఁ డటకుం జని
యదిగో నిశాటారి యనుచు హరిసన్నిధి నె
మ్మది గాని యందింపఁగఁ దా
నదిగొని చదువుకొనె శౌరి యధికప్రీతిన్. ౫౮

తే. గీ. పురుషుఁడు గరిష్ఠవిభవుఁడు పూర్ణుఁడు మతి
సాము వేద్యుఁడు సామ్నాయశాస్త్రధర్మ
పాలకుఁడు పాత్రదత్తాత్మపదుఁడు నయిన
పాత్రునకు దత్త యాకన్య పరఁగ ధన్య. ౫౯

చ. కువలయనాథ కామవశగుల్ పరు లాత్మల నన్ను నీపదాం
కవిరచితాంకనుం బడయఁ గాచినవా రది సింహయోగ్యవ
స్తువు శునకాళి కోరుట కవో భవతాపహరస్వపాంగ యా
హవమున సంతి కాగ తమ మానుచ రాశులఁ జేయు వారలన్. ౬౦

తే. గీ. దయిత దేహ్యాంగజాతనిలయ దయాబ్ధి
యంగజాతశతోర్జితో దారరూప
యంఘ్రిసేవ నొసంగు మాహానమునందు
నన్నుఁ గైకొను వేగ యనాథనాథ. ౬౧

మ. అరిసంహార యుమేశహంసగమనేంద్రాగాగ్న్యాదులున్ మానులున్
వరశాస్త్రార్థ్వరతాత్ములైనబుధులున్ భావింప కే థిక్కరిం
చి రహిన్ నిన్ సకలాధినాథుఁ బ్రభుఁ గాంక్షింతున్ సదా నిన్మదిన్
హరి సర్వోత్తము తావకీనఘననూక్తాసక్తనై ప్రోవవే. ౬౨

తే. గీ. విమల స్వాపచ్ఛిదోర్జిత విక్రమాఖ్య
లోకనాథ దయాంబుధి లోకవంద్య
గోపికారతమ యచ్యుత కూర్మి నన్ను
నీయ దుర్దశ దొలఁగించి వేగ ప్రోవు. ౬౩

తే. గీ. అన్న యారుక్మితో నేమి యయ్య యైన
భీష్మకునితోడ నా కేమి పృథ్వి రాజ
సంఘ్నతులతోడి దేమి నీజాయ నైతి
మున్నె కావున నను నీయ నెన్నికొనుము. ౬౪

తే. గీ. ఘన త్వదంఘ్రియుగ్మార్చన కర్మయోగ్య
నెసఁగ నన్యజనాభోగ్య నీశ నన్నుఁ
గైకొనుము తక్క తేని యీకాయ మింత
వదలి త్వన్మనోయోగ్యరూపంబుఁ గొందు. ౬౫

చ. అరయఁగ నెల్ల జీవులకు నచ్యుతతాప్తి ప్రసిద్ధ మయ్యు నే
వరుని నిరూఢిఁ బొందెను ధ్రువంబుగ నచ్యుతనామ మట్టి ని
న్నె రహి మనంబునం బతిగ నేను వరించితి వీరవర్య శ్రీ
కర చనుదెంచి వేగ ననుఁ గైకొనుమా కొనుమా యశేం బిటన్.

ఉపేంద్రవజ్ర. త్వదైక్యబుద్ధుల్ శిశు♦పాలముఖ్యుల్
త్వదేకపత్నిన్ ననుఁ ♦ దారు పొందన్
యదూద్వహా కోరెద ♦ రాన పొందన్
త్వదైక్యబుద్ధుల్ కన ♦ దైత్యులౌటన్. ౧౭

తే. గీ. మొగి ముకుంద సౌందర్యస♦ముద్ర యిమ్ము
లక్షణం బాశ్రిత నగునా ♦ కీయ వేని
ప్రాణనాథ గుణాశ్రితా♦భాగ్య మైన
నిమ్ము దిక్చర నైన నా ♦ కిందిరేశ. ౧౮

తే. గీ. ఈవు దేవ స్వతంత్రుఁడ ♦ వేను గమల
నీదు జాయను గావున ♦ నాదు ప్రార్థ
నానుసారంబుగ నపజ్జ♦నాభిమాన
హాని యొనరింపు వైళంబ ♦ ప్రాణనాథ. ౧౯

క. శేషించినసమయమున న
శేషజగం బుదరమందుఁ ♦ జేర్చి మహాబ్ధిన్
శేషునిపైఁ బండెడు శ్రీ
భూషణ నిను పీడి కోరఁ ♦ బోలునె యన్యున్. ౨౦

చ. హరి సదశావృతంబు లగు♦నబ్జభవాండము లెన్ని యేని యే
పరముని రోమకూపముల ♦ భాసిలెడుం బరమాణులీల నో
వరదుఁడ యట్టినీతనువు ♦ వర్తిలు నారయఁ బాంచభౌతిక
స్ఫురితముగా నటం చనుట ♦ చొప్పదునే తగునే వినంగనున్. ౨౧

( కుండినపురప్రవేశ వర్ణనము. )

క. అనునాపత్త్రాలాపము
మనమున హర్షమును బ్రీతి ♦ మెల్లడిగొనఁగాఁ

గని యరద మెక్కి యప్పుడె
చనిరొ వడిఁ మాధవుఁడు ని♦జపురికడకున్. ౨౨

క. కమలాసందేశంబునఁ
కమలాక్షుం డలరి యరిగెఁ ♦ గడువడిఁ జతురం
గములఁ గొని దరస్మితముఖ
కమలుండై వేడ్క భీష్మ♦కప్రభుపురికిన్. ౨౩

తే. గీ. వచనమాత్రహృతుం డయి ♦ వాసుదేవుఁ
డల్ల బ్రాహ్మణుఁ జేపట్టి ♦ నధికకరుణ
నట్టియాశ్రితపక్షుఁగుఁ ♦ డమర రుక్మి
ణీకరగ్రహణము సేయు♦టే కడిఁదిరొ.

తే. గీ. అమలకమలోదయార్థ ము♦ద్యన్మరీచి
సుచయభాసితసర్వదే♦శుండు రచిత
నిశిచరోలూకశోకుండు ♦ నెటి దినేశు
గతిని సచ్చక్రమానిత♦గతియు నగుచుఁ
బూర్వసింధూపకంఠముఁ ♦ బొంది వెలిఁగె. ౨౫

చ. హరి యట దుష్టపూర్ణ మగు♦నానగరిం జొర నొల్ల కొక్కెడం
బురమువెలిన్ వసించెఁ బర♦ముం గన వేడ్కలు తొంగలింపఁగాఁ
బరువిడి వచ్చునాగరక♦పంక్తుల నాస్థలి యాపురిం దగన్
బరువడి గెల్చె నాఁ దనరె ♦ వైఖరిఁ దీరి దృగుత్సవాప్తులన్. ౨౬

తే. గీ. పౌరు లప్పు డుపాయన♦పాణు లగుచు
భద్రమూర్తి సౌందర్యస♦ముద్రసాంద్రుఁ
జూచి యన్యులు వ్యర్థు లం♦చు మది రోసి
విభు హరి సదారు లౌచు సే♦వించి రెలమి. ౨౭

చ. ఇతఁ డతనుండు కాఁడు గణియింపఁగ శ్యామలకోమలాంగకుం
డితఁడు విధుండు కాఁడు మది నెన్నఁగ వీతకళంకశంకుఁ డీ
యతిసుభగుండు కాఁడు రవి యాశ్రితలోకదృగార్తిహారి తా
నితఁడు పురాణుఁడౌం బురుషుఁ డీప్సితదాయియు నద్వితీయుఁడున్

తే. గీ. కమలయే యగు నాపద్మగంధి భీష్మ
తనయ సుభగాగ్రగణ్యుఁ డీతఁడు తదీశుఁ
డిట్టివిరలకలయిక తెలివిఁ గోరు
చున్న మాకోర్కెఁ దీర్చుత మొగి విధాత. ౭౯

మ. అనువొందం బురుషాగ్రగణ్యుఁ డితఁ డేతన్మాత్రిం బ్రియుర్గా రుక్మిణిన్
మనభాగ్యంబునఁ బొందెనేని యది హేమం బింద్రనీలంబుఁ గూ
ర్చినయట్లొప్పు ననన్యసా లయిన లక్షింపంగ జాంబూనదం
బున లోహం బతుకంగఁ బెట్టినటులౌఁ బో యెల్లు కా నున్నదో

తే. గీ. ఇటులు పౌరులు పల్కుచుఁ గృష్ణు వినుతి
సేసి నయనోత్సవంబులు సేసి కొనఁగ
హరియు దయతోడ మందస్మితాస్య మమర
వారి రంజిల్లఁగాఁ జేసె వరదుఁ డంత. ౮౧

(రుక్మిణీహరణ వర్ణనము.)

తే. గీ. సంచలత్పతాకోజ్జ్వలచామరౌఘ
మై పరిస్ఫురచ్ఛత్రసహస్రశోభ
మై విచిత్రతూర్యధ్వను లాశ లంద
నపుడు రుక్మిణికులదైవయాత్ర యొప్పె. ౮౨

క. స్వజనకగృహదేవిఁ గొలిచి
నిజగృహదేవుఁ గన నరిగె నెఱిఁ దన్నగరం

బుజసన్నిధి రథ మెక్కఁగ
నిజహృదయము వొంగ రుక్మిణియు నెన్నడలన్. ౬౩

మాలిని. జలజకులజగంధస్పర్ధిసౌరభ్య యంతన్
స్వాలపవిలసదక్షిస్తంభితావ్యాప్తి యూచున్
గలికి విమలపూర్ణాగణ్యలావణ్య శ్రోణిన్
గలభగతి నిజేశున్ గాముదున్ భైష్మి చూచెన్. ౬౪

క. తనతలిదండ్రులకూడిక
కునష్ట మాట యుచితంబె కునృపుల కనుచున్
ఘనరోషంబున నెల్లర
ఘనమూర్ఛల ముంచె స్మరుఁడు కనదస్త్రములన్. ౬౫

శా. దేవ్రాత్తంసుఁడు భూతముల్ మదనమందీభూతచిత్తంబులౌ
నావేళన్ జనియెన్ స్వతంత్రుఁ డల ఫుల్లాక్ష్యంబుజోద్భూతహా
ర్షావార్యోదకధార మోదవిపులోద్యద్రోమరాజిన్ బలే
యావైదర్భిని బాణిచేఁ దసరథంబందున్ వడిం గొంచుఁ దాన్

చ. పరిణయ మేటికిన్ మరలఁ బద్మకనంగ నపాంగదూతికా
చిరవినివేదితాత్మ ఘనచిత్త సురాగ సుయోగ రుక్మిణిన్
బరముఁడు కృష్ణుఁ డార్తజనబంధుఁడు శ్రీరమణుండు ప్రీతుఁడై
పరువడిఁ గొంచు వే యరిగె వైరివిదారుఁడు నిందువేడుకన్. ౬౭

మ. పతివక్త్రేందుసమీపలగ్నముదితప్రాంచత్కటాక్షాఢ్య త
న్నతహస్తాంబుజయుగ్మవేష్టితలసన్మధ్యాఢ్యయున్ లోకస
న్నుత భర్త్రింసయుగాహితాంసయుగ సంతోషాబ్ధిమగ్నాత్మయై
పతి పాణిగ్రహణాధికోత్సవము గా స్వాంతంబునం బొంగెఁ దాన్.

(యుద్ధవర్ణనము.)

చ. మదనవశుల్ మహీశులు స♦మానులు వేగ తదీయవిప్రయో
గదహనదహ్యమానులయి ♦ గాత్రము లానలినాక్షి ముందటన్
వదలఁగ నిశ్చయించి తగ ♦ భానునివెంటఁ దమంబు పోవున
ట్లదలిచి శౌరివెంబడి ర♦యంబున నేగిరి లుబ్ధబుద్ధులై. ౮౯

సీ. రమణ భైష్మిని బరి♦రంభణం బొనరింపఁ
బూనినకుజనుల♦భుజయుగముల
సాంద్రమామ్ముఖ♦చంద్రచుంబనవాంఛ
నరుగుదుష్టులయుత్త♦మాంగములను
లలి ననింద్యచరిత్రఁ ♦ గలసి భాషింపంగ
లోలు రౌధూర్తుల♦నాలుకలను
లోకమాతను గూడి ♦ లోలత శయనింపఁ
గోరినఖలులశ♦రీరములను
శౌరిభటులు నిశిత♦శస్త్రాస్త్రచయముల
నఱికి తఱిగి త్రెంచి ♦ నరకలోక
వాసి యైనప్రేత♦వర్గంబుతో శయ్యఁ
బండఁ జేసి రథిక♦బలులు వేగ. ౯౦

శా. సుగ్రీవోద్ధత సైన్యమాత్రబలుఁ డా♦చక్ రక్తపాథోధి న
త్యుగ్రాస్త్రాలిహతేభవాజితతిఁ దో♦త్తోఁ గట్టి ప్రాచీనపం
క్తిగ్రీవున్ జితుఁ జేసి పొందె భుజశ♦క్తిం బూర్వరాముండు న
వ్యగ్రాన్యున్ వడిఁ బూర్వసీతను స్వకీ♦యున్ బూతవృత్తం దగన్.

చ. అనుపమశౌరియుద్ధగతి ♦ నాకసమం దమరాళి పొల్చి క
న్గొనుచును శత్రురాజిఁ గని ♦ కొందఱు వల్కిరి కళ్ళి దచ్యుతం

వ్యసనమదేహా యటంచు నప♦రోఁటతిభయాదివనాక్రమిష్టాత్తటం
చెనయఁగ నొడ్లుకశ్చిదహా♦యాదహాయాయనికొందఱుఁ దగన్.

మ. శివ నాథాహితమాత కెట్లుపకృతిం ♦ జేసెన్ దగం దీర్చె నే
సివలాకున్ హరివిప్రయోగ మరయం ♦ దద్విప్రయోగంబు నా
యువిదన్ శ్రీదయితుండు తా స్వవిరహా♦యోగ్యన్ సమవ్యాపినిన్
భువి నశ్లేషకథన్ గొనెన్ శ్రుతిచయం♦బుం జక్క రక్షించుచున్
వివిధాశ్లేషకథాళితోడ ఖలులన్ ♦ వేవేగ శిక్షించుచున్. ౯౩

మ. హరి యాశత్రుసమూహ ముఖ్యఖశిఖుం♦డై స్వప్రతాపాగ్ని వే
ల్చి రహిన్ రక్తరసార్ద్రితం గన శర♦శ్రేణీవృతిం జేసి వా
విరి స్వస్థాప్పితపుష్పలాజవృతుఁడై ♦ పృథ్వీశదత్తార్ఘముల్
పరగం గొంచు స్వకీయఁ గొం చరిగె ని♦శ్శంకన్ నిసర్గప్రియన్.

చ. హరి తనజాయఁ గొం చరుగ ♦ నప్పుడు తద్ఘనబంధుదుర్దశం
బరువడి నొందిన ట్లన నృ♦పాలురు కొందఱు కాలుప్రోలు వొం
దిరి మఱి కొంద ఱేష్చిరి త♦గన్ విధి దూఱుచు మూర్ఛ గొంద ఱొం
దిరి శిశుపాలముఖ్యులు మ♦దిం దురపిల్లిరి మోహితాత్ములై. ౯౫

క. అరయఁగ రిపుసైన్యము శ్రీ
హరిచేఁ దత్సేనచేత ♦ హతమయ్యె నటం
టరయమి జననీద్రోహుని
నిరఁ జైద్యునిఁ గూడుటయె వ♦హించె ననల్పమై. ౯౬

క. రుక్మిణి కనఁ జక్రధరుఁడు
రుక్మగతి విరోధియై ని♦రోధించినయా
రుక్మిధనుశ్శతము విఱిచె
రుక్మమయము భావికార్య♦రుచిఁ గనఁ బూనన్. ౯౭

తే. గీ. రుక్మిణీరూప యగుసిరి ♦ రుక్మిగృహము
విడిచి చన నంతలో నింద్ర♦వినుతకీర్తి
మురరిపుఁడు వాని ముండిత♦మూర్ధజునిఁగఁ
జేసె యుక్తంబ కద గత♦శ్రీకున కిల. ౯౮

తే. గీ. అంతఁ దరళనేత్రాంత య♦నన్యకాంత
బహుసహస్రసంఖ్యావని♦పాలభంగ
సమ్యగుత్థభాస్వజ్జయ♦చంద్రముఖులు
నాత్మదాసీజనులు గాఁగ ♦ నలరె భైష్మి. ౯౯

మ. తనయోధుల్ జయకామినీపరివృతుల్ ♦ దైర్ఘ్యోర్జితుల్ గర్జిలం
గన నశ్వాళి రణాప్తవాజినుల వే♦డ్కం బొంది హేషాధ్వనిం
దనరన్ హస్తులు హస్తినుల్ కలసి యం♦తన్ మోదిలన్ బృంహిత
ధ్వని భక్తేష్టుఁడు మున్న చేసె దయితా♦ప్రాప్తంబుగాఁ దత్తరిన్.

( ద్వారకాగమన వర్ణనము. )

క. జలజాతాయతలోచనుఁ
డలంకృతం బగునిజపురి ♦ హయహస్తిరథా
వలితో నామేచకకుం
తల యాప్రియతోడఁ జొచ్చెఁ ♦ దద్దయు వేడ్కన్.

( మూలమాధవోపవనప్రవేశ వర్ణనము. )

సీ. వృక్షరాజంబులు ♦ వివిధపుష్పంబుల
శుకసమితి మనోజ్ఞ♦సూక్తితతుల
మలయుకోకిలరాజి ♦ మంజుస్వరంబుల
నాత్తకేకిగణంబు ♦ నృత్తములను
గంధగజావళి ♦ గమనైకచతురత
శైలముల్ చారుని♦ర్ఝరవరముల

మణికుట్టిమస్థల ♦ గణము మచ్ఛాయల
హరిణముల్ తరళేక్ష ♦ ణాధికతను
బరఁగు చుండ రాజ ♦ భవనంబు బాగున
నొప్పు చున్న శుభద ♦ ముపవనంబు
మాధవుండు వేర ♦ మాదేవితోఁ గూడ
వచ్చి మూలమాధ ♦ వంబుఁ జేరె. ౧౦౨

ఆ. వె. వసుధ విశదరీతి ♦ వైదర్భిఁ బెండిలి
లోన కరము పట్ట ♦ లోఁ దలంచి
మూలమాధవుండు ♦ మూలమాధవమునఁ
దోడిబంధుజనుల ♦ తోడ విడిసె. ౧౦౩

వ. అంత. ౧౦౪

(సూర్యాస్తమయ వర్ణనము.)

తరువోజ. సురలు మాహేంద్రది ♦ క్సుదతికి వేడ్కఁ
శుభకుండలము రచిం ♦ చుట కాత్మ నెంచి
యరయ వాతాయనం ♦ బై గగనాఖ్య
మహాభాజనంబున ♦ నగ్నిలోఁ జేర్చి
పరితప్తమైన ను ♦ పాయుంబుతోడ
వడి స్ఫులింగాలితో ♦ వారిలో నైనఁ
బరఁగు హేమం బన ♦ వఱలి సూర్యుండు
పడెను రాగాంకుఁడై ♦ పశ్చిమాంబుధిని. ౧౦౫

మ. కరపాళి న్నగపాళిఁ బట్టుకొనియున్ ♦ గంజాప్తుఁ డబ్ధిం బడెన్
గరము౦ జిత్రము కా సరిత్తతిని వీఁ ♦ కన్ శోషిలం జేయు నం
చురుకోపంబున నబ్ధి మ్రింగె నని నే ♦ నూహింతుఁ బో మ్రింగెనే
పరు లాత్మీయజనాపకారుల సమీ ♦ పం బొందు వేళన్ వడిన్. ౧౦౬

చ. రవి సహజాత మయ్యును స్వ♦రాగము ద్రోచి సదబ్జచక్రమా
స్యవరకరాళి విష్ణుపద ♦ మంది కృతోగ్రతపుండునై తగన్
దివిఁ బ్రతతోర్ధ్వపాదుఁ డయి ♦ దేవవరుం డటఁ జేరెఁ దత్ఫలం
బవు నటు గాక వార్ధిఁ బడె ♦ నం చనుటల్ తగ వౌ నొకో ధరన్.

తే. గీ. తాపసులఁ దప్తులను జేసి ♦ ధరణి జీవ
నంబుఁ గరముల హరియించి ♦ నళినిసత్సు
కాంతి మాయించురవిపాత ♦ మెంతు మేము
యుక్తము యటంచు యుక్తిస♦హోక్తు లరసి. ౧౦౮

చ. ద్యుమణియు వజ్రపాణిదిశ ♦ నొందెను జన్మము మింటిమధ్యమం
దమరఁ బ్రవృద్ధగాత్రుఁడుగ ♦ నయ్యెను బాశిదిగంతమందు న
స్తమయము నొందె బాపురె వి♦ధాత్రునిదేశ మదెంతవారి కే
ని మఱి యలంఘనీయ మగు ♦ నెమ్మది నెంచఁగఁ జూవె మేదినిన్.

ఉ. రాగి యినుండు దిగ్యువతి♦రాజపయోధరసీమలం గనున్
రాగము నుంచి మేరుగిరి♦రాజము దాఁట దిగంగనాళి సాం
ధ్యాగతపక్షిరావముల♦వ్యాజమునన్ విలపించె నాఁ దమో
యోగము వే యసంతరమ♦యొందినమూర్ఛ యనంగఁ బొల్చె నౌ.

చ. వననిధిహృత్పదంబు తలఁ♦పన్ మఱి సంధవళీకృతాంబు వౌ
తనప్రతిరూప మేర్పడఁగఁ ♦ దా నటఁ జూచుచుఁ శాంతుఁ డెల్లెడన్
జనహృదయంగముం డగుచు ♦ శ్లాఘ్యతముం డగుఁ గాదె యంచుఁ [దా
నును గడు శాంతిఁ బూని తప♦నుండు పయోనిధిఁ జొచ్చె నంతటన్.

శా. తో నక్షాళినితాంతమిత్రుఁ డలమి♦త్రుం డస్తముం బొందఁ బ
ద్మాకరం బమలాంబులొందియుఁ దదా♦స్యవ్రాతముల్ కాంతులన్

హీనంబై మొగిడెఁ గ్విన్ష్టుఁడు ప్రియుం ♦ డెన్నంగ సంపన్నతా
నూనాస్యంబున కేని ముద్ర యిడఁ గాఁ♦దో చిత్రకీర్తిఁ భువిన్.

సీ. కంజ మాకందోద♦కంబుల వసియించి
హృద్గతమధుకర♦బృందలలిత
ఝంకార మద్ది ర♦మోఙ్కారమై యొప్పఁ
గలితకంటకకంట♦కములు వెలయఁ
మంత్రార్థచింతమై ♦ మాటికిఁ దలఁయూఁచు
కరణి నీషత్కంపి♦శిరము శోడ
హంసౌఘశిక్షితం ♦ బై తాపసునిఁ బోలి
మదిలో విధాత్రునిఁ ♦ బదిలపఱచి
కూర్మి మిత్రోదయంబును ♦ గోరి కడఁక
సానిశంబును డాఁ దప ♦ మాచరించు
చున్నదియ పోలెఁ గనుపట్టె ♦ వన్నె దక్కి
ధాత్రి నిటు లుండ నగు మైత్రి ♦ మిత్రునెడల. ౧౧౩

( చంద్రోదయ వర్ణనము. )

తే.గీ. రవి యపరదిగ్యువతిఁ జేరి ♦ రాగ మొందఁ
బ్రాగ్దిగంగన ఘనరోష♦రక్తమును ని
బద్ధసిలభ్రుకుటియునై ♦ వక్త్ర మొనర
నిలిచె నాఁ గ నవేందుమం♦డలము వొలిచె. ౧౧౪

తరువోజ. అల శశి మఱి ప్రాగ్ది♦గంగనఁ గూర్చి
యటకు సంధికిఁ దార♦కాళులఁ బనిచి
యులరు చామీఁదఁ ద♦దంఘ్రుల కెఱఁగి
యన్యదిక్సంగజ♦న్యస్ఫురత్కోప

తులితతమంబును ♦ దోన మాయించి
తుంగకరంబుల♦తోఁ దానిఁ దాఁకి
సులలితాస్యాంభోజ♦చుంబనార్థముగ
జోక మీఁదికిఁ బ్రాఁకెఁ ♦ జొచ్చెను నిజము. ౧౧౫

మ. అల దిగ్భామలు చంద్రకోమలకరా♦ఘాతాంగసంగంబుచే
నెలమిం బొంది తమంబునున్ విడిచి తా♦రిందుం బ్రియుం గా జనం
బులు నిద్రించుతఱిన్ వరించిరి తమిన్ ♦ బాల్పొంద నిమ్మేదినీ
స్థలి నెప్డున్ గణియింత్రె నాత్మవిషయా♦శల్ పాపసంఘంబులన్

తరువోజ. సరసుఁ డావిధుఁడు ప్రా♦గ్జలధిస్నానంబు
సలిపి ఫేనం బను♦చందనం బలఁది
కరము స్వాంకం బలం♦కారమూల మగు
ఘనసీలతిలకంబు ♦ గాఁగఁ దారౌఘ
వరహార మొంది న♦భం బనుకబరిఁ
బట్టి కౌఁగిటఁ గర♦పంక్తితోఁ జేర్చి
చిరరాగమునను రం♦జిల్లఁగాఁ జేసి
చెలిఁ బ్రాగ్దిగంగనఁ ♦ జేరె ముద్దిడియె. ౧౧౬

చ. అల యుదితోర్ధ్వరశ్మిని శ♦శాంకునిఁ గూడి సతారమై తగన్
వెలుఁగునభంబు స్వర్ణపరి♦వీతసురాధిపనీలమధ్య మా
విలసితకంఠభూషను ఛ♦విం దగుహారముఁ బొంది మించునా
జలరుహనాభువక్షముప♦మన్ గణనీయతఁ గాంచె నెంతయున్

తరువోజ. సలిలవాహావృత♦సర్వభాగంబు
శశలక్షణంబు సీ♦మద్దృష్టకోణ
మొలయ నభోగ్రస్థ ♦ ముదితేందుబింబ
మొనసి హరిత్రోపదం ♦ బొప్పెఁ గాశ్మీర

లలితంబు మఱియుఁ జే♦లమున నావృతము
లలి మరుద్వ్యక్తాంచ♦లంబును మఱియుఁ
దలఁప మధ్యోపరి♦స్థము భిన్నిదైన
స్తనకోశమును బోలి ♦ తద్దయు వింత. ౧౧౯

తే. గీ. దిగ్యువతిపతి రవి యన్య♦దేశమునకు
నరుగఁ జంద్రుఁడు మెల్లన ♦ నరుగుదెంచి
కరముల గ్రహించె వారియం♦బరము నడిమి
దాన నేమొ కళంకి నాఁ ♦ దలఁపఁబడెను. ౧౨౦

చ. ఇరవుగఁ బౌర్ణమాసినిసి ♦ సిందుఁడు కృష్ణయశఃపురంధ్రి దా
హారిణమదార్తిముం బ్రబిరి♦లాంచితకేశభరస్థపుష్పముల్
వరశుభనిత్యసంస్తుతుల♦వ్యాజమునన్ స్వముఖంబులం దగన్
సురవరు లుంచునట్టి యగు♦సుందరసత్క్రియ యన్యోఁ గానిచో
సిరికిఁ బ్రమోదముల్ విపుల♦చేసల కార్తియు నెట్లు చేసెడున్.

గీ. రవి దివస్పతి హృతతస్క♦రప్రచారుఁ
డమర సరదృగ్విదూరస♦ద్మమును బొంద
రజనిపతి పూర్ణబింబుఁడు ♦ రహిని వచ్చి
మానవులకు శ్రమం బంత ♦ మాయఁ జేసె. ౧౨౨

వ. అంత. ౧౨౩

( సూర్యోదయ వర్ణనము. )

చ. హరి పురిఁ జేర నందు విహ♦గాళిరుతంబులు తెల్పఁ బ్రాగ్దిగ
ద్ధి రమణ స్నాతుఁడై యచల♦పీఠి వసించి సరోరుహంబులం
గరములఁ బట్టి రాగి యయి ♦ గాఢతమం బణ శౌరిపూజకై
కరములఁ జాఁపె నాఁ దరణి ♦ కానఁగ నయ్యెను బూర్వదిక్తటిన్.

తే. గీ. మేరుశైలస్థ సురలతి ♦ శౌరిపూజ
కొసరఁగ సముద్రదీర్ఘిక ♦ నుండి కొనిన
రమ్య మైనసహస్రప♦త్త్రి మన నభము
పొందెను సహస్రకిరణుండు ♦ పొలుపు మీఱ. ౧౨౫

చ. దివిని ద్యురత్న మొంది తగఁ ♦ దేజరిలన్ భువనోదయంబులై
భువి నల యంబుజాతములు ♦ పొల్పెసఁగెన్ ముదితంబు లౌచు నీ
భువి యదువంశరత్న మది ♦ పొల్పెసఁగెన్ గడు హర్షసంగతిన్
దివి నమరాననాబ్జములు ♦ తేజరిలెం దగఁ జిత్రరీతిగాన్. ౧౨౬

తే. గీ. ఉష్ణరశ్మ్యుదయంబున ♦ నొనరఁ దరులఁ
బక్షిగణములరవములు ♦ వఱలె మఱియు
నతులదుష్ణోష్ణరశ్మి యా♦హరి పొదలఁగ
వందిమాగధరవములు ♦ వఱలెఁ బురిని. ౧౨౭

తే. గీ. ఊర్ధ్వముఖకేతనాభంబు ♦ లొగి నధోము
ఖాత్తతోరణాకారంబు ♦ లై మయూఖ
ములు దివి వెలింగెఁ బురి నూర్ధ్వ♦ముఖపతాక
లల యధోముఖతోరణ♦ములు వెలిఁగె. ౧౨౮

తే. గీ. ఉన్ముఖమయూఖతతిచేత ♦ నొనర విష్ణు
పదము నంటుచుఁ గ్రమమునఁ ♦ బడసె నూర్ధ్వ
మమరఁ దరణి విష్ణుపదము ♦ నంటుపుణ్యుఁ
డొనరఁ గ్రమముగ నూర్ధ్వంబు ♦ నొందు టరుదె. ౧౨౯

తే. గీ. తిగ్మరోచియు ఛాయ నొం♦దినజనులకు
గ్లాన మీయక సుఖదాయి ♦ గాఁగ నొప్పెఁ
గ్రూరుఁ డయ్యును దగఁ దాప♦కారి యౌను
పఱఁగ స్వకళత్రసంబంధ♦భజకులకును. ౧౩౦

వ. అంత నవ్వసుదేవనందనుండు వందిమాగధస్తుతుల మేల్కాంచి కా
ల్యకరణీయ క్రియలు నిర్వర్తించి రుక్మిణీసహితుండై పురప్రవే
శంబు సేయునప్పుడు.

(ద్వారకాపురప్రవేశ వర్ణనము.)

చ. తనవిభుఁ డొక్కఁ డెంతొ గొని స♦స్థైర్యుఁడు రాఁ గని యుల్గి ద్వారమం
దొనరఁగ ద్వారకాయువతి ♦ యుల్లసితోభయభాగదివ్యకాం
చనకిరణాంచలంబున ని♦జప్రియు లోనికిఁ బోవకుండ ని
ల్పినయది యయ్యె దానిహరి ♦ ప్రేమకటాక్షములం గనుంగొనెన్.

చ. హరి బలవంతుఁడై చొరఁగ ♦ నప్పుడు తత్సితచంద్రికాద్రవ
ద్రవశశికాంతమై నయన♦వారి ధరించినయట్లు లోప్పి పై
స్వరచితసంభ్రమోత్థఘన♦సవ్యరజోమలినాస్య యౌచు భా
సురపురలక్ష్మి యుగ్గతన♦చోరభసంబున నొప్పె నెంతయున్.

మ. నగరీకాంత వియోగశంకిమతి స్వాం♦తప్రస్ఫురద్వప్రల
గ్నగరిష్ఠోన్నశిరాజిఁ దత్ప్రతికృతిన్ ♦ దా నిల్పి యౌత్సుక్య మొ
ప్పఁగఁ దద్భూషణకాంతులన్ ఫలితమై ♦ భావింప నాయచ్యుతున్
దగ శ్రీకృష్ణ నిజేశుఁ గొల్చు చరిగెన్ ♦ దనవ్యంగిమై తద్దయున్.

తే. గీ. నెఱిఁ జలత్పతాకానిల♦నిర్మలీకృ
తము రథౌఘచక్రావళిఁ ♦ దగ సవిరాకృ
తము సురాలిముక్తామల♦సుమలసితము
తతగజేంద్రదానాంబుసిం♦చితము మఱియు. ౧౩౫

ఉ. పండితసాము లెల్ల హయ♦పాండితిమై నడిపింప నిట్టటుల్
మండలధావనోద్ధతత ♦ మానితచామరమండనాళులన్
మండిత మౌచు హేషితస♦మంచితభాసురవక్త్రియుక్తమై
దండిగఁ బొల్చు సద్ధయక♦దంబముచే విలసిల్లు సద్దియున్. ౧౩౬

తే. గీ. ప్రతతపార్శ్వద్వయస్థేభ♦పంక్తి దయిన
కలశనిభరంగికుంభాళి ♦ ఘనసుశీల
రత్నతోరణాభపరస్ప♦రకలితోర్ధ్వ
ముఖసుకుంచితాగ్రకరాళిఁ ♦ బొల్చునదియు. ౧౩౭

తే. గీ. అమరఁ బ్రాగ్గుణికాంగనా♦త్యంతచిత్ర
రత్నభూషణోజ్జ్వలితవ♦రచరణజిత
రంగకాంతియు నై నయా♦రాజవీథి
మదనశతరూపుఁ డరిగెఁ దా ♦ మందగతిని. ౧౩౮

సీ. మధ్యసంస్థాపితమాధవంబు దరస్మి
తోల్లసత్సైనసం♦చయము సతత
సంచలచ్చామర♦సంచయోర్విగణంబు
వితతాతపత్రక♦వివిధకమఠ
మగణితేభాశ్వప♦త్త్యావృతంబును సునీ
నా వేణురవగర్జ♦నంబు మఱియు
మిళితసంధన్నాని♦మిషయుతం బంతరా
గతమహీశబలౌఘ♦ఘనసదంబు
శౌరికీర్తిప్రభాక్షీర♦పూరితంబు
మోదదవిదర్భజాస్యచం♦ద్రోదయంబు
విమలజయలక్ష్మీనిలయంబు ♦ విపులతరము
నై యమరె మాధవచమూసు♦ధాబ్ధి యపుడు. ౧౩౯

మ. జలజాతాశ్వరథేభపత్తితతిచే ♦ సంజాతమై వృత్రజి
న్నిలయంబుం దరయ మీరఁ జొచ్చురజమా♦నీలాంబుదశ్యామసం

గిలసత్సచ్చిదచిత్సుసంగభజకుల్ ♦ గీర్వాణలోకంబు ని
ట్టులె మాహాత్మ్యకులయ్యుఁ బొందుదురు చూ♦డుం డంచుఁ దెల్పెం
[దగన్. ౧౪౦

తే. గీ. సాగరుం డూర్మికరధృత♦శంఖచక్ర
ముల సముద్రుఁడై సితఫేన♦ముల సమీప
భూమిఁ బఱచె వస్త్రావళి ♦ మురవిరోధి
యగుగుఁ ద్రోవలఁ బఱిచె నా ♦ సవుడు గూర్మి. ౧౪౧

( మూలమాధవవన వర్ణనము. )

మ. హారినీలాశ్మసుశోభిపత్త్రివృతమున్ ♦ వ్యాలంబిపుష్పస్ఫుర
ద్వరముక్తాసర ముల్లసత్కిసలయ♦ప్రవాళోజ్జ్వలం బెన్న సా
గరసంప్రేషితరత్నశోభితల మిం♦కం గాంచన స్తంభముం
దరమై సన్మణిమండపానుకృతి యా♦తత్తత్సువృక్షాళితోన్. ౧౪౨

మ. అనిశాలంబిఫలావళుల్ కలపికా♦ద్యారబ్ధసంగీతముల్
ధ్వనదంభోనిధిమర్దలంబు శుకరా♦వస్తోత్రముల్ భృంగగీ
ర్ఘనవీణారవముల్ సుకేకినటులున్ ♦ రాజిల్ల మాంగల్యవే
శ్మనిభం బొచుఁ బతత్సుమాకుతల నా♦చంచద్వనం బొప్పెడున్.

తే. గీ. ఒనరఁగఁ బ్రియాంగపరిరంభ♦ణోత్సవంబు
నిందిరాదేవి తొలుదొల్త ♦ నెచటఁ బొందె
నాస్థలమునె స్థలజ్ఞు లౌ♦నఖిలబుధులు
మూలమాధవక్షేత్ర మం♦చోలి ననిరి. ౧౪౪

( వివాహోపక్రమణికా వర్ణనము. )

క. కొందఱు భైష్మీపక్షము
కొందఱు హరిపక్షము నృప♦కులులు పదారుల్

పొందిరి మఱి కడలియును మి
న్నందిరి రమాపతుల మేన ♦ టంచపు డఱచె. ౧౪౫

తే. గీ. రత్నమయపూర్ణ రవివర్ణ ♦ రమ్యవరసు
వర్ణపాత్రోత్కరముల స ♦ త్కర్ణపత్త్రి
ముఖ్యశోభనదస్తుసం ♦ పూర్ణములు గఁ
జేసికొను చెల్లపనులు కై ♦ సేసికొనుచు. ౧౪౬

క. చిత్తంబు లలర నృపతులు
ముత్తైదువ లఖలవాద్య ♦ములధ్వనులు దిశల్
హత్తుకొన వధూగృహమున
కత్తఱి శుభగీతు లమర ♦ నరిగిరి వరుసన్. ౧౪౭

ఉ. ఆయెడ నిశ్చితార్థమున ♦ కావిధిఁ జేరినయార్యు లెల్లఁ దా
రాయునతీయువాంగఘట ♦ నైకవిచారము సేయు మాధవుం
డాయువతీసుపీనకల ♦ శాభపయోధరమధ్యదేశ మే
యేయెడఁ జూచినం దనకు ♦ నెంతయు దుర్ఘట మంచు నెంచెఁ బో.

తే. గీ. కన్యఁ గనకదామకదంబ ♦ గౌరి భైష్మి
నీయఁ దగు ధన్య యాహారి ♦ కింద్రనీల
భాసి కితఁడు విన్యుల్లస ♦ ద్వారిదాభుఁ
డై ప్రసుష్టాళి వర్ణించు ♦ నరయ మీకు ౧౪౯

తే. గీ. సతి విదర్భవంశోదధి ♦ జాతరత్న
మాతఁ డుడునాథవంశోద్భ ♦ వైకభూష
ణుండు వీరలయోగంబు ♦ మండిత మగు
చమరెడుఁ బరంపరాయోగ్య ♦ మైనకతన. ౧౫౦

తే. గీ. పావనాంగి పద్మాలయ ♦ భైష్మి సీర
దాభుఁ డల్లనారాయణుఁ ♦ డంసుకతన

సమరఁ దద్వ్యక్తి సుస్థిరం ♦ బని తలఁచెద
నెసఁగ నన్యోన్యసువిభూతి ♦ హేతు వగుట. ౧౫౧

వ. అని యిట్లువ్వరపక్షులు లభ్యర్థించిన వధూపక్షులు లిట్లనిరి. ౧౫౨

ఉ. యాదవనాథుఁ డేయెడల ♦ నైనను భైష్మికిఁ గష్ట మియ్యఁగా
రా దొకనాఁడునన్ విడువ ♦ రా దొకనాఁడును గోపగింపఁగా
రా దటు లేని యాతఁడు క ♦ రగ్రహణం బొనరించుఁ గాత స
మ్మోదముతోడ మానుగుణ ♦ భూషణ మాసరసీరుహేక్షణన్.

తే. గీ. దేవికి సపత్ని తగదు సం ♦ దేశమున న
పంప వలయును సర్వదా ♦ బందుగులను
సర్వద స్మరించునది యిట్లు ♦ సమ్మతించి
తేని మాకన్య నిను వరి ♦ యించుఁ గాత. ౧౫౪

వ. అనుటయు వరపక్షులు లిట్లనిరి. ౧౫౫

మ. అల బ్రహ్మాండము శౌరి కిల్లు పదునా ♦ ల్గా మేడలున్ గాంచనా
చలభూధాన్యమణీక్షుసారలవణ ♦ స్వాదూదదధ్యాదిని
స్తులగేహాచితవస్తురాసు లమరున్ ♦ జుం డందు బ్రహ్మాదిపు
త్రులకార్యంబుల నిండ్ల నెల్ల సతి స ♦ ద్వ్యక్తిన్ విచారించుతన్.

తే. గీ. ఇతరుల కసాధ్య మాగృహ ♦ కృత్య మెందు
గృహిణి కది భారకారి కా ♦ దెన్నఁ డన్ని
యంతయు స్వలోలలీలాక ♦ టాక్షమాత్ర
మునను నెఱవేర్ప నేరుచు ♦ ముదముతోడ. ౧౫౬

చ. హరి సిరిఁ బాయునే సభల ♦ యందు రహస్థలి నేనియున్ భవాం
తరములనే సనన్యవిహా ♦ రక్రమమజ్జనభోజనాద్యలం
కరణవినోద మాయువతి ♦ కార్యము సుం డిక నేమి యన్నఁ ద
ద్విరహిత మైనదేశమును ♦ వే యొడఁబాయును గాక వెండియున్.

తే. గీ. తనమ భూషణముగ నెంచు • దరుణి నితఁడు
శుభద మైనస్వాంగా శ్లేష•సుఖ మొసంగు
తన్వి కొసఁగు వంశాద్యా శ్రి•తం బగుతన
యుధరపీయూషమును బ్రీతి • ననవరతము. ౧౫౯

క. కోపింపఁడు జగములమెనఁ
గోపము కల్గినను దేవి • గొనుఁ గాఁగిటిలోఁ
జాపమతి దేవి హరి నెడఁ
జాపఁ గడఁగుకుమతిమెడన • నహియించుఁ గ్రుద్ధ౯. ౧౬౦

చ. అల సతి కోపగించునవు • డాతఁడు కేశము వట్టి పాణిజం
బులఁ గుచకుంభ పార్శ్వములఁ • బూన్చి క్షతంబులఁ జేసి యంతఁ గో
మలమధురోష్ఠముం గఱచి • మానిని మానము మాని వశ్యఁగా
లలి నొనరింపఁజే యది వి•లాసమ కాదె తలంప నెంతయు౯. ౧౬౧

క. అనిశము స్వభర్తగృహముల
కనుపఁడు సిరి శౌరి దాని • నడుగరు వారు౯
ఘును లఖిలదునకు నర్పణ
మొనరిచి సిరి నరలఁ గోరు • టుచితమె మీరు౯. ౧౬౨

క. హరి సిరిని విడిచి యన్యుల
వరియించునె పురుషవరుఁడు • పరముఁడు పూర్ణుం
డరయఁగ నల్లనియు నా
తనుభులయుం దేని సిరిన • తా రమియించు౯. ౧౬౩

తే. గీ. సర్వదాపరోక్షీకృత•సర్వవిశ్వుఁ
డన్న స్మరణీయశీలుఁ డా•నితఁడు మిమ్ము
వరయ స్మరియించు టది యెట్లు • స్వాంఘ్రియుగ్మ
మును స్మరించిన మీకిచ్చు • ఘునఫలంబు. ౧౬౪

వ. అనుటయుఁ బ్రహృష్టచిత్తులై యత్తలోదరీపార్శ్వగు లి ట్లనిరి.

తే. గీ. హరికిఁ బరిబర్హ మైన రథాశ్వవార
ణాదిబల మియ్య నే నస మస్థుల మీఁక
యువతి నిత్తు మింతియె సుమహూర్తికులను
దగుముహూర్తంబు నడుగుఁడు త్వర ననుటయు. ౧౬౮

తే. గీ. వా రనిరి పరిబర్హంబు బలముఁ గోరఁ
డతఁడు పూర్ణసుఖుం డెందు నరయ నింక
నల విరించినై రించిముఖామరులకు
ఘనవిభవ మిచ్చుతత్కటాక్షంబ కోరు. ౧౬౯

ఉ. వారిముఖంబునన్ విధుఁడు వారు దరస్మితసద్బుధాంచితుల్
వారికరంబులన్ ద్యుమణి బల్కటియందు గురూక్తి మధ్య మ
వ్వారిది కావ్యకాస్పదము వారిపదాప్తుఁడు మంగళుండు న
వ్వారిపదంబు కేతుగము వారిగతుల్ తగ మాంద్యగంబు లౌ.

చ. మువితులు కాంత్యధఃకృతతమోమహిముల్ కద వారు వెండి త
ద్వదనము చూడఁగాఁ గలుగు వారికిఁ జంద్రబలంబుఁ దారముల్
బదిలముగాఁ బఠింపఁ గల వారికిఁ దారబలంబు నిచ్చు స
ద్విదితుల కేక్షణంబును మఱింక దలఁపన్ సుముహూర్తమే యగున్.

తే. గీ. తెలియ జ్యోతిష్పథజ్ఞోక్తతిథుల ద్వాత్రి
దినము లెన్న నుద్యన్మహర్ధిని దలంప
వలయు జనులకు మఱి శుభాభంబ నైన
శైష్మికది కల్పరూపమై భీష్మ మగును. ౧౭౦

తే. గీ. క్రముకయుక్తతాంబూలపత్త్రిమ వివాహ
ఘనశుభోత్సవసూచక మని తల చెద

మదియు తత్తరుణీతతు♦లైకవిహిత
పరమమాంగల్యదీక్షోత్స♦వద మనుటయు. ౧౭౧

తే. గీ. అంతఁ గ్రమముగ నుభయవ♦ర్గాబ్జముఖులు
గృహగృహంబులఁ దగ సహ♦రిద్రతైల
మును వివాహమహోత్సవ♦మూలభూత
మిచ్చిరి పరస్పరస్నేహ ♦ మిచ్చ దనరఁగ. ౧౭౨

తే. గీ. మఱుదినము కన్యకావరుల్ ♦ మాన్య లర్థ
కాములై పితృదేవతా♦గణసమర్చ
లొనరిచి తదగ్రమంద చీ♦ర్ణోత్సవులుగ
నుంట నన జాతలజ్జులై ♦ యొప్పి రపుడు. ౧౭౩

తే. గీ. అంత స్నాతకసాధర్మ్య ♦ మవధరించి
యల్ల యదునందనుఁడు తీర్థ♦యాత్ర కరుగఁ
గడఁగ రుక్మిణీపతకగా♦గ్రణి యొకండు
హరిని వారించె నపుడు తా ♦ ననునయోక్తి. ౧౭౪

చ. హరి భవపాశమోచన మ♦హామతి శ్రీయుత తీర్థయాత్రకై
యరుగుట లేల నిల్వు మర♦యన్ జనునప్పుడు నీపిఱుంద నీ
చరణము సోఁకుచోటులు భృ♦శంబుగఁ దీర్థము లౌ నటుండఁగా
సురనుతచర్య నీయెదుటఁ ♦ జొప్పడ నెయ్యది యుండుఁ జెప్పుమా.

తే. గీ. ఈశ తీర్థ మాడఁగఁ గోరి ♦ తే నట నటఁ
బానర నభిషేక మొనరింత్రు ♦ మునులు నీకు
జలగతుఁ గఁ జేయు చుందురు ♦ లలి వివేక
మలర నిన్నింకఁ దీర్థాళి ♦ నరయ నేల. ౧౭౬

తే. గీ. సంద్య నీగుణకీర్తన♦నర్తనాదు
లెచట నచటన తీర్థంబు ♦ లెసఁగు సుజనుఁ

డెవ్వఁ డచ్చట స్వసుకృతం • బెల్ల నీకు
నర్పణము సేయుఁ బూర్ణుఁ డౌ • నతఁడు చూవె. ౧౭౭

చ. జలరుహనాభ నీచరణ•సంగతి స్వస్సరిదాదితీర్థముల్
తలఁపఁ బవిత్రతం బడసెఁ • దద్వచ్ఛుభదాంగచయానుషంగస
త్ఫలభజదంతరంగయుత•భక్తులచేతను వెండి పూత మా
నిల నిఁక నట్టితీర్థముల • నే మని క్రుంకఁగఁ గోరె దిచ్ఛలోఁ.

చ. అరయ నజాండకర్పరగ•తాయుతకోటిసుతీర్థపాళి నీ
నిరుపమరోమకూపమును • నిఁపఁగఁ జాలదు గంగ యేని నీ
చరణనఖంబునం దడపఁ • జాలదు సు మ్మిఁక నెట్టితీర్థమం
దు రమణఁ గ్రుంకెఁ బోయెదవు• దోషవిదూర రమాధినాయకా.

మ. అల భ్రూకాశిని నాభిమానసవతిన్ • హారావళీగంగ ని
స్తులనీపీసుసరస్వతిన్ బ్రవిలస•ద్రోమార్కజన్ శైష్మినిన్
లలిఁ గాంచీజఘనన్ గుచోచ్చబదరిన్ • లక్ష్యద్వ్యపాంగప్రభా
తులకావేర్యగమధ్యగేందుసరసిన్ • దోఁ బొందిరన్ యాత్ర యా

తే. గీ. దేవ మూలమాధవమున • దేవిఁ గరము
వట్టి జగదప్రతిమతీర్థ•వర్య మాచుఁ
బరఁగఁ జేయుము దానిని • వ్యాప్త యింక
యాత్ర వేళొంపు మే మొప్ప • మనఘచరిత. ౧౮౧

వ. అనుటయు నయ్యదునందనుండు యాత్రాగమనవినోదం బుజ్జగించి.

తే. గీ. వేడ్క నిత్యనిజోరుస్థ•భీష్మకాత్మ
జాఘనోత్తుంగనృత్యత్కు•చగ్రహావిధి
విఘ్నశాంతికై యను నట్లు • విభుఁడు శౌరి
కడఁక నొనరించె గ్రహశాంతి•కర్మ మంత. ౧౮౩

## (బ్రహ్మాది దేవతా వర్ణనము.)

వ. అంతఁ దత్పరిణయమహోత్సవవీక్షణాయత్తచిత్తంబుల స్వయంభు ప్రముఖామరు లేతెంచి సభ నలంకరించిన నపుడు రుక్మిణికిం దత్సఖమణి వారలం జూపి యందు బ్రహ్మం జేర్కొని యద్దేవి కిట్లనియె.

మ. మును కల్పాంతజలంబులం గమలతో ♦ భోగీంద్రతల్పంబునం
దనరన్ వేడ్క వసించి భక్తజనబృం♦దంబుల్ దగం గొల్వఁ బొ
ల్చిననారాయణునాభినుండి యుదయిం♦చెం బద్మ మొం డందు నీ
యనఘాత్ముం డల పద్మయోని యనఁగా ♦ నబ్జాక్షి పుట్టెం జుమీ.

మ. అనయం బీతనితండ్రి యైనా మురరిపుం ♦ డాత్మాభిధుండన్ స్వయ
మ్మను పేరం జనువాఁ డవాచ్యుఁ డగుటన్ ♦ హంసాశ్వ నీయబ్జజున్
మునిముఖ్యుల్ దగ నాత్మయోనియు స్వయం♦భుం డం చజుం
[డంచు నా
త్మను వేదాప్తిని వేదగర్భుఁ డనుచున్ ♦ దర్కింతు రిచ్చన్ సఖీ.

తే. గీ. అల మహోర్మిసంఘాతశీ♦తాతతాంబు
పుల సదృష్టసద్విష్టర♦జలజమూలుఁ
డై విధిజ్ఞుఁడు విధి తండ్రి ♦ నరయఁ గోరి
తద్విజితాతివృత్తియై ♦ తపము సేసె. ౧౮౭

తే. గీ. లీల నంబుకల్లోలవి♦లోలడోల
ఘనసహస్రసురత్నాంశు♦గణతృణీకృ
తార్కసిధులక్షలక్ష్మియై ♦ యులరునట్టి
నాగకులసార్వభౌముస♦ద్భోగశయ్య. ౧౮౮

తే. గీ. సింధుపుత్రికతోడ వ♦సించి, యలరు
నీరజాయతేక్షణుఁ గమ♦నీయవదన

హస్రదోర్దండభాసితు • నబ్జఁ బ్రవాల
సుమృదుపాదారుణీకృతా • శుఁ గని రిలఁను. ౧౮౯

తే. గీ. శుభసువర్ణవర్ణాంబర • శోభిమధ్యు
మొగి ఇగన్యాలావణ్యస • ముద్రహృద్యుఁ
గని విశాలసీలాచల • కల్ప మంద
సస్మితాననాధఃకృత • చంద్రదర్పు. ౧౯౦

తే. గీ. హారిఁ బరిస్ఫురత్కుండల • హారకాంచి
కాకిరీటముద్రాంగదా • గణ్యహీర
గాదిభూషణశోభు స • హస్రరశ్మి
శతలసద్గాత్రభాసిత • సర్వదేశు. ౧౯౧

తే. గీ. సుఖ విశాలవక్షఃస్థల • శోభిరత్నుఁ
జిరసుభక్తివిసరములు • చిత్రభూష
ణాళిభూషితాంగు లగుఁబ • లారిభాను
ముఖులచే వంద్యుఁ డౌదేవ • ముఖ్యుఁ గనిరి. ౧౯౨

శా. ఉన్నాలాబ్జవరాతపత్త్రి సహిరా • మున్నమ్రసింహాసనున్
సన్నద్ధోర్జితముక్తభృత్యనికరున్ • సాంద్రోర్మిసచ్చామరున్
దన్నాదాభిధదుందుభిన్ శుభయశ • స్సత్యూర్మిలన్ సీలదే
హు న్నారాయణచక్రవర్తిని నితం • డుస్మిలితాత్మున్ ఘనున్.

తే. గీ. వందిపగిదిని వినుతించి • భక్తి వలర
మారమేశానుమతిని స • మస్తసృష్టి
సేసి తత్సన్నతి ధన్యుఁడై • చెలఁగి భక్త
వర్యులను సగ్రగణ్యుఁడై • వరఁగె నిలఁడు. ౧౯౪

వ. అని జగత్ప్రాణిబుం జెల్కాని యిట్లనియె. ౧౯౫

తే. గీ. అతఁడె సకి సుమ్ము ప్రాణగణాధినాథుఁ
డఖిలగుణముల సముఁడు స్వయంభువునకు
మును శివాదుల శ్రేష్ఠత్వఘనవివాద
మున స్వసత్త్వము ప్రకటించె ఘనుఁ డితండు. ౧౯౬

వ. అని యహిభూషణాహిపాహిరిపులం జేర్కొని యి ట్లనియె. ౧౯౭

తే. గీ. శర్వుఁ డితఁడు సురారిసంచయవిభేద
దక్షుఁడు పురత్రయంబును దగ్ధ మయ్యె
నితనిచే విష్ణుపదతీర్థ మితఁడు దాల్చె
సతి వరునిఁ జేసికొనియె నసాధ్య నితని. ౧౯౮

మ. సకి, శేషుం డితఁడె వాయుకూర్మతనుపృష్ఠంబందుఁ బుచ్ఛంబు నుం
చి కుభృద్భ్రాజసరిత్సముద్రనగరక్షేత్రాదిసంపూర్ణ మౌ
సకలం బెన్న సుపృథ్విఁ బృథ్వి సమంచచ్ఛక్తిభోగాతప
త్రికమం దితఁడెసుమ్ము తాల్చె నవికారప్రక్రియం గోమలీ. ౧౯౯

ఉ. వనిత సుపర్ణుఁ డితఁ డహివర్ణ్యబలుండు గరుద్భవోన్మరు
ద్ఘనజవచాలితాద్రితరుకంధిసమూహుఁడు మున్ను గోమద
ద్రిని రణమందు మాధవుకిరీటము దొంగిలినట్టిదానవుల్
ఘనబలుఁ గ్రుంచి తెచ్చి ఘనకాయుఁ డొసంగె సురారివైరికిన్.

వ. అని దిక్పాలురం జేర్కొని యి ట్లనియె. ౨౦౧

తే. గీ. సకి త్రివిక్రమశ్రీపాదసత్ప్రసాద
మునఁ ద్రివిష్టపనాథుఁడై పొనరు నితఁడు
క్షీరవారిధిఁ బ్రచ్చి విచిత్రభాగ్య
వృతుఁడు గావింపఁబడె నింద్రుఁ డలివ యితఁడు. ౨౦౨

తే. గీ. కల్పతరువు కరివరము కావ్యవర్ణి
తాశ్వమును గల్గి సభను సింహాసనమున

నింద్రపదయోగ్యసువిభూతి • యిచ్చెఁ దధిప
సించి దేవతాసభను బా•లించు చుండు. ౨౦౩

క. ఇతఁడు సురగురుఁడు ధర్మం
డితఁడు సహస్రకరుఁ డెన్న • నితఁడు సుధాంశుం
డితఁ డల రత్నాకరుఁ డన
నుతి గనువాఁ డండజేం గ•నుంగొనుము సకీ. ౨౦౪

వ. అని యిట్లు చూపి చెప్పిన నిజమూలరూపవాసనావిశేషంబున లోక
మాత యగుట వారలం బుత్త్రపౌత్త్రభృత్యాదిభావంబునం బరిత్య
జించి యావారిమధ్య హరిపార్శ్వంబునకై మొగంబుఁ ద్రిప్పిన నప్పు
డాసఖీమణి యతనిం జేర్కొని యిట్లనియె. ౨౦౫

తే. గీ. అబల చిత్ప్రమోదమయావ్య•యాంగుఁ డఖిల
దోషశూన్యుఁడు గుణసము•ద్రుఁడు ముకుందుఁ
డితఁడు సర్వసజ్జనపాల•నేచ్ఛ భూత
లమున నుదయించెఁ జూవె యీ•సుమహితుండు. ౨౦౬

తే. గీ. అల జగజ్జనిస్థేమల•యాదిధర్మ
ము లవి విశ్వయోని యగునీ•పురుషువలన
నగు నెవనిరోమకూపాళి • నబ్జజాండ
యుత మతని సముఁ డెవఁడు దే•వతలలోన. ౨౦౭

తే. గీ. సేతిహాసపురాణస•త్స్మృతులు సకల
వేదములు క్షీరనిధి నుద్భ•వించినసిరిఁ
బడసిన సమానశూన్యునిఁ • బ్రభుని వరదుఁ
దెలుపుచున్నవి వింటె స•తీలలామ. ౨౦౮

తే. గీ. ఆహరిపదాబ్జ మండక•టాహభేది
జలజయోనిహస్తార్పణ•సారవేది

నై రహించెడు వివిధావ • తారశోభిత

భూమిభారుఁ డితండు పూఁ • బోఁడి వినుము. ౨౦౯

మ. అల బాలగ్రహరూప పూతన విషం • బానించువేళన్ వ్రజ
స్థలి బాలగ్రహరూపుఁ డౌనితనిచే • సంపీడనం బొంది వ్యా
కులతన్ దాన విషాగ్నిఁ గ్రాఁగె జగతిం • గ్రోధాత్ములై వే మహా
త్ములకుం గీడు తలంచి తార చెడి పో • దుర్గాదె దుష్టాత్మకుల్.

మ. శకటాకారి సురారి విష్ణుపదసం • స్పర్శంబునన్ స్వస్వరూ
పకుఁడై పైఁ జని యద్ది విష్ణుపద మన్ • భ్రాంతిన్ బడెన్ బృథ్వి వా
రక యావిష్ణుపదాప్తి మాయ పొలుపా • రన్ నిల్చునే దైత్యజా
తికి బుద్ధుల్ విపరీతవృత్తు లగుఁ గా • దే నాశకాలంబునన్. ౨౧౧

సీ. పరివృత్తనేత్రుఁడై • పనవె రజోవృత
భ్రాంతవ్రజజనాక్షి • పద్ముఁ డగుచు
మొగిని మూర్ఛాభ్రాంత • మూర్ధుఁ డయ్యెను గృత
వ్రజజనమూర్ఛనా • వస్థుఁ డగుచుఁ
గ్లేశావృతుం డయ్యెఁ • గృతపరవ్రజసాధు
జనమానసక్లేశ • సంఘుఁ డగుచు
శైలాగ్రపతితుఁడై • చచ్చెను గృతసంద
గేహినీవరసుత • క్లేశుఁ డగుచు
హరిని హరియింప నరుదెంచి • యాసురాసు
రాశి యన మరుదాకృతి • గ్రీశుఁ డొంచు
మింటి కెగసి యోర్వఁగ లేక • మేదినిపయిఁ
బతితుఁ డౌచుఁ దృణావర్తుఁ • డతివ వింటె. ౨౧౨

పంచచామరము. స్వరక్ష్యవత్సవేషధారి • వత్సదైత్యు శౌరి తాఁ
గరంబులం గ్రహించి యూర్ధ్వ • గమ్యుఁ జేసె వాఁడు తాఁ

సరగన్ గుబ్జను నేనుఁగున్ రజకునిన్ ♦ జాణూరముఖ్యాళి మ
ల్లుర సేనావళిఁ బంచి మామ ననిచెన్ ♦ లోకేశ్వరుం డర్మిలిన్.

క. పంచజనుని యమునిఁ జేరఁగఁ
బంచి కొనియెఁ బాంచజన్య♦వరశంఖము వే
పంచజనవిరహితంబుగఁ
బంచజనవపువు జలధియుఁ ♦ బరముఁడు సేసెన్. ౨౨౦

ఉ. పంచజనాఖ్యప్రాణములఁ ♦ బన్నగ మున్ యమునిఁ జేర దూతలం
బంచి కడంక నేగి గురు♦బాలునిఁ దెమ్ము గాక తద్గతిన్
గాంచెద నంచుఁ దెల్పె నన♦గాఁ బుడివాకిట వేదరంబు పూ
రించి యముం డొసంగఁ గొని ♦ కృష్ణుఁ డొసర్చె గురున్ సపుత్త్రుఁ
[గాన్. ౨౨౧

తే. గీ. భీష్మసుత యంత సఖియు వి♦వేకసఖియుఁ
గలిప ధృతమాలధ్యైయ యూర♦కయ నిలిచెను
గృష్ణునే యల్ల సతి వరి♦యించె ననుచు
దాని హర్షచిహ్నంబులు ♦ తద్ద దెలిపె. ౨౨౨

మ. ఇతఁ డుగ్రుం డతిచంచలుం డితఁడు తా ♦ వృద్ధుం డితం డీతఁ డీ
క్షితి గోత్రాసహుఁ డితఁ డో జ్వలనుఁ డి♦స్సీ వక్రితుండుం డితం
డితఁ డెన్నం దపనుండు సుమ్ము జడపుం ♦ డితండు గూఢాంఘ్రి యీ
గతిఁ దా ధిక్కృత దేవయై తరుణి శ్రీ♦కాంతున్ వరించెం దమిన్.

సీ. వనరుహాగర్భుండు ♦ వైదికగ్రామణి
జపశీలుఁ డనిలుండు ♦ సంతతంబు
శివ్యుఁ డెన్నఁగ నెప్డు ♦ సవిరాగచిత్తుండు
వ్యాసపారశరవహుం ♦ డమరభర్త

సూర్యుఁడు తా నెప్డుఁ ♦ బర్యటనేష్టుండు
కోకాహితుండు దో ♦ షాకరుండు
అంగజుఁ డెన్న న ♦ నంగుండు మఱియును
శేషుం డకర్ణుండు ♦ సిద్ధ మిదియు
పక్షిపాతి ఖగేశుండు ♦ పరఁగ యముఁడు
ప్రేతపతి బావురే జడ ♦ ప్రియుఁడు వరుణుఁ
డంచుఁ దర్కించి తరుణి యా ♦ యసురగణము
మది నుపేక్షించి వరియించె ♦ యదుకులేశు. ౧౧౮

మ. వరుసం జంపకయుక్తిఁ బద్మనిధికిన్ ♦ బద్మాప్తిఁ గోకారికిన్
వరనీలోత్పలయుక్తి సూర్యునకు దూ ♦ ర్వాప్రాప్తి నాగారికిన్
అరయం గైతకయుక్తి శూలికిఁ దుల ♦ స్యాప్తిం గణస్వామికిన్
బరఁగన్ యోగ్యముకాక మాల యలరెం ♦ బద్మాక్షుమాత్రార్హమై.

తే. గీ. తలఁపఁగ హరిప్రసాదభో ♦ క్త లగు నీసు
రాలి కీసుమాలిక నియ్య ♦ నగు నె యనుచు
భామ తాఁ బ్రమోదోత్థిత ♦ రోమరాజి
యై సమర్పించె దాని నా ♦ రాయణునకు. ౧౧౯

( రుక్మిణీకృష్ణుల వివాహ వర్ణనము. )

తే. గీ. తన్ముహూర్తావధిగ మధ్య ♦ దత్తమైన
పటము ఛేదించి యొండొరు ♦ ప్రభలు వారిఁ
దాఁకుచుండె నెప్డు నఖండి ♦ త మగు యోగ
భాగ్య మిట్టి దనుచు జ్ఞాన ♦ వంతు లెఱుఁగ. ౧౨౦

చ. జనకసుతాస్వయంవరవి ♦ శాలమహోత్సవగీతు లైదువుల్
ఘనమతిఁ బాడ రుక్మిణికిఁ ♦ గల్గుగగుర్పులు కృష్ణుఁ డప్పు డం

దినదరహాస మొల్లరకుఁ ♦ దెల్పెను భైష్మియ సిత కృష్ణుఁడే
యనకులుఁ డివ్వి వీరికథ ♦ లే కథ యేమిటఁ జిత్ర మం చటన్.

ఉ. అంతఁ బటంబు దీయఁగ ర♦యంబున నొండొరుఁ జూచువేళ న
య్యింతిముఖాబ్జ మొందె జల♦జేక్షణునేత్రము కాంతకన్ను లా
స్వాంతజరూపునాభికమ♦లాకర మొందెను భానునేత్రుఁ డ
క్కాంతుఁడు నుత్పలాక్షి యల ♦ కామిని కావున నద్ది యుక్తమా.

తే. గీ. కడఁక గుడయుతశుభజీర♦కములు బంధు
చయము వారలపైఁ బోయు♦సమయమందు
క్షీరధిసుతాజితుం డగు♦శ్రీహరి యల
తరుణిపక్షమువారివి ♦ తాల్చె మొదల. ౨౩౦

తే. గీ. కాంత కాంతున కాపాద♦కంఠముగను
సత్కటాక్షనీలోత్పల♦చారుమాల
నొసఁగెఁ గాంతుఁడు తత్క్షణం ♦ బొనర హృష్ట
రోమసత్కంచుక మొసంగె ♦ భామ కపుడు. ౨౩౧

మ. ప్రియ ధారాంబుచయంబుతోఁ దడిసె సు♦ప్రేమాశ్రుధారన్ [సుమో
చ్చయహాసం బునిచెన్ మెడన్ బ్రణయ మన్♦సన్మాల నేత్రాంతదృ
క్చయనీరాజన మిచ్చె సుస్మితసుధన్ ♦ జాల న్నివేదించె నా
ప్రియ నీరీతి భజించి పొందె ఫలమున్ ♦ వే పార్శ్వగత్వంబు తోన్.

తే. గీ. సరగ సమలంకృతాంగు లౌ♦సతులు గీత
తతి శుభకథలఁ గుంకుమా♦క్షతలు చల్ల
స్వర్ణపీఠస్థు లావధూ♦వరు లొసఁగిరి
సదయదృష్టుల వారి క♦క్షతఫలముల. ౨౩౨

తే. గీ. అల వధూవరుల్ గమ్యర♦హాస్యగోష్ఠి
హాస్యగాగ్ని నాత్మీయుఁగా ♦ నమరఁ జేయ
నవఁగ లాజసమేధితా♦గ్నిని గృహీత
కరులయి ప్రదక్షిణంబు నే♦సిరి ముదమున. ౨౩౮

తే. గీ. ఎలమి నాలవదినమున ♦ హ్యాప్లు లగుచుఁ
దల్పతమఁ డయి శేషుండు ♦ తమరతార్థ
మిటఁ జిరము నిల్వ వహియింపుఁ ♦ డిల నని దిగి
భంబుఁనను వేఁడి రస నాగ♦బలి సలిపిరి. ౨౩౯

మ. హరి కల్పించె స్మితాఖ్యతారము నపాం♦గాశ్వాళుల్ హ్యాత్ప్వరం
బురువక్షోరుహకుంభిఁ గాయకనక♦ప్రోద్భూతరోమప్రజల్
హరిసంసక్తమనోరథంబు వివిధాం♦గాభోల్లసద్వస్త్రముల్
హరిసౌగ్యామృతసాధనాధరధరల్ ♦ హస్తంబుతో నింతి తాల్.

తే. గీ. నరులు నారులు నాస్వయం♦వరమున స్ఫుర
దంగలేపులు స్మితశోభి♦తాస్యు లుజ్జ్వ
లత్కలాపులు చిత్రవ♦స్త్రాళిత్కరయుతు
లగుచును జరించిరి వధూవ♦రాభు లగుచు. ౨౪౦

క. దుర్గమ మగుద్వారకపురి
భార్గవితోఁ గృష్ణుఁ డంత ♦ బలహుఁడు శచితో
స్వర్గమును బోలెఁ జొచ్చెను
స్వర్గినికరగీయమాన♦చరితుం డగుచున్. ౨౪౧

( సముద్ర వర్ణనము. )

తే. గీ. స్వవర ఫేనకాంతిని ♦ చిత♦పార్శ్వ ద్యయుగ్మ
మార్గ్వశిఖల సుపీతమ♦ధ్య మిఁక నన్ని

యెడల నసితంబు నై యొప్పి ♦ కడలి భూత
ధాత్రికి విచిత్రవస్త్రమై ♦ తనరెఁ జూడ. ౨౩౯

తే. గీ. తగ నసహ్యావహిష్ణువ్యథి♦తంబ యయ్యుఁ
గడలి బహురత్నములఁ దాల్చుఁ ♦ గడుఘనందు
నింత పానీయ మే నొడ్ల ♦ కీయదు ధన
లాభునకు నెక్కుడౌఁ గద ♦ లోభ మరయ. ౨౪౦

తే. గీ. మొగి సరిత్పతి తన్ముఖ♦మునను వడి వి
వేకహీనుఁడై కడచెను ♦ వేల యదియ
కాదె స్త్రీయుక్తులకు వివే♦కం బ దెచట
వేల యెచ్చటఁ దలఁపంగ ♦ విశ్వమందు. ౨౪౧

తే. గీ. నది బహూపయోగ్యత నొంది♦నను సముద్రు
కడఁ జెలంగుఁ గంటకిశోప♦కంఠరీతి
స్వైరిణులు గూఢతరభోగ♦సాధ్య లయ్యు
భర్తయెడ సదాచారసం♦పన్నల కద. ౨౪౨

మ. సలిలేశుం డల స్వీయదిగ్యువతి నో♦జం గూడి సన్మిత్రు నే
ని లలిం జంద్రుని రమ్యుఁడై యడఁగు వా♦సిం జూచుచున్ సమ్మదో
జ్జ్వలుఁడై పొంగెను నస్సు కావె జగతిన్ ♦ జర్చింపఁగా మైత్రి యొ
క్కలతాంగిన్ మదిఁ గోరు నిర్భరకు జో♦కన్ నిల్చునే యేరికిన్.

చ. అనిశము కాలసన్నిభమ♦హాబడబానలతప్తగాత్రుఁ డ
య్యును ముదితుండపోలె నెపు ♦ డుద్ధతి గర్జల నొప్పుచుండు నీ
రనిధి సుఫేనసంచయద♦రస్మితకాంతి నభశ్శ్రుగూర్చియై
ఘనుఁడు గభీరభావుఁడు ప్ర♦కాశము సేయునె నైజకష్టముల్.

తే. గీ. శౌరి దోషిసఖత్వసం♦జాత మాన
సేన్యత హరించె స్వగృహ మ♦హాసింధువునకు

ఏమి చిత్రంబు తలఁపఁ ద♦దిష్టసంగ
మంబె సకలాఘము లడంచు ♦ మహిని గాదె. ౨౪౫

తే. గీ. మురవిరోధి యజర్యుఁడు ♦ మున్నె యిప్పు
డబ్ధిఁ బురిఁ గట్టుకొటన్న దా ♦ నశ్యాజయ్యెఁ
డయ్యె స్వకళత్రవస్త్రకృ♦తాలయు ననుఁ
జెనక నోపుదురే యొరు ♦ లనుచు నహహ. ౨౪౬

తే. గీ. శుభ్రరమ్యఫేనాసవ♦శోభివక్త్రిఁ
డై విధూదయమున నూర్మి♦హస్తముల న
దీజఘనముల నంటు న♦బ్ధి యల చంద్రుఁ
గనిన నేరికిఁ గామంబు ♦ కలుగ దొక్కొ. ౨౪౭

తే. గీ. ఒగి సుపీతకృశానుమ♦ధ్యుఁడు సితేత
రుఁడు నదీపరిశ్లిష్టగా♦త్రుండు నగుచు
నుదధి యొప్పెను బహుయోషి♦దుత్కరపరి
తోషదాయి యాకృష్ణుతోఁ ♦ దుల్యుఁ డనఁగ. ౨౪౮

క. ఈరీతిగ మునినాథులు
ద్వారక కేగుచును ద్రోవ ♦ వార్ధిఁ బొగడుచున్
ద్వారవతిని జేరి నిరతం
బారాధించిరి ముకుందు ♦ నతిభక్తిమెయిన్. ౨౪౯

(శ్రీరుక్మిణీకృష్ణుల యవయవ వర్ణనము.)

మ. చిరరక్తస్వతలైకకాంతివిలస♦త్స్వాదోర్ధ్వభాగచ్ఛవిన్
వరచంద్రద్యుతివృత్తసన్నఖరుచిన్ ♦ స్వర్ణోజ్జ్వలద్భూషణా
చిరరత్నప్రభతోన్. మెఱుంగిడులస♦చ్ఛ్రీరుక్మిణీకృష్ణస
చ్చరణాబ్జంబులు సేవ్యముల్ నిఖిలస♦త్సంపత్ప్రదంబుల్ దగన్.

తే. గీ. వరరమా స్తనకుంకుమ♦పంకసంగ
మఖిలమునిమనస్సరసీరు♦హంబు మఱియు
నుత్తమమనోజ్ఞనఖమౌక్తి♦కౌఘశోభి
తతసురక్తాంగుళీలస♦ద్దలలసితము. ౨౫౧

తే. గీ. తలఁపఁ గ్వణదాస్యహంసక♦దంబజృంభి
మౌక్తికోల్లసత్కింకిణీ♦మఞ్జులంబు
తద్వదనజాతకవిగీత♦తతమనోజ్ఞ
లలితలేఖాభరేఖాళి♦లక్షితంబు. ౨౫౨

తే. గీ. విమలబోధరవిద్యుతి♦వికసితంబు
లలి సుజనమాన్యగుణభాజ ♦ కలుషిన్నైరి
రుచిరసౌరభ్యలుబ్ధమా♦నుతనిలయము
రమ్యకారుణ్యమాన్యమ♦రందఘనము. ౨౫౩

తే. గీ. నిత్యసక్తస్వసద్భృత్య♦నేత్రనామ
విహితమత్తాళిసంతత♦స్వీకృతంబు
కర్ణికోజ్జ్వలతలకాంతి♦కలితము నగు
హరిపదాబ్జంబు మన్మాన♦సాళివసతి. ౨౫౪

తరువోజ. నిరతశంఖాంభోజ♦నిధుల నిష్టార్థ
నిఖిలదానంబున ♦ నిశితాంకుశంబు
నరయ హస్తిన్యాంత♦రాకర్షణమున
నశనిని సురరిపు♦హారణంబుచేతఁ
బరువడి నిర్జించి ♦ ధ్వజ మున్నతంబు
వడి నస్త్రై శ్రీకృష్ణు♦పాదపద్మంబు
నరగ నాయువియు ల♦క్షణగణవ్యాజ
నరణి సేవించెఁ ద♦త్సరసతలంబు. ౨౫౫

మ. తలఁపన్ ధర్మరతుల్ పరస్పరవిరో♦ధం బొందియున్ శౌరియం
దెలమిం బొల్చెడు నం చొగిం దెలుపున♦ ట్లిమ్ముఁగ నాచంద్రమః
కలికావిద్యుతిమన్నఖాంకములు శ్రీ♦కాంతేశుపాదాంబుజం
బులు మా కెప్పుడుఁ గావుతన్ శరణముల్♦మోదప్రదంబుల్ ధరన్

చ. జలరుహుఁ డిందుఁ డెన్నఁ దన♦శత్రుల మూర్ధమునన్ నఖంబులన్
జలరుహనాభుపాదజల♦జంబులు తొల్చుటఁ గాంచి వైరమున్
జలజకులంబుపై నిలిపెఁ ♦ జంద్రు నిజాహితతత్పదాంబుజం
బులు ధరియించె మైత్రి యని ♦ పూనె సమిత్రత యద్ది చంద్రుపై.

మ. కమలాంగీకృతుఁ డెప్డు నుచ్చగతి వే♦డ్కన్ బొందె నౌ నంచు లో
కమునం జాటెడుకీర్తిఁ దొల్తఁ గమలా♦కాంతాకరం బొంది వే
క్రమకీర్తిన్ గుచఫాలమూర్ధసుకచా♦గ్రంబుల్ దగం బొందునా
కమలాక్షాంఘ్రిసరోజముల్ మము సుభా♦గ్యం బొందఁగాఁ జేయు
తన్. ౨౫౮

చ. తరుణవిభిన్నవిద్రుమవి♦తానసువృత్తరిలసత్స్ఫురద్రమా
కరకమలాంగుళీదలసు♦కాంతు లొనర్చెను కృష్ణుపాదనీ
రరుహములం దొగిన్ సహజ♦రాజదలక్తకచిహ్నకాంతి బల్
పరఁశిగ నింత తోఁప హరి♦సన్నఖమండలమండనార్హమున్. ౨౫౯

తే. గీ. పఱల సంతరాప్రాంచిత♦బహ్వసంత
భూరిసౌందర్యశేషసం♦పూర్యమాణ
విశదపుష్టోర్ధ్వతలలు సు♦వృత్తలు నగు
వారిజంఘు లెసఁగుత మ♦ద్భావవీథి. ౨౬౦

తే. గీ. అరయ నెవఁడూ మున్ సందగ్ధ♦హాంగణమున
జానుసంచరణమున ర♦జస్సు చూర్ణ

ముగ వలిచె వట్టిపూర్ణుండు ♦ మొగి సలుపుతఁ
జూర్ణముగ మన్మనోరజ♦స్సును నిరతము. ౨౬౧

మ. అల కాంతిన్ హరినీలకాంచనములన్ ♦ హ స్తీంద్రహస్తంబు వ
ర్తులతాధర్మమునన్ మృదుత్వగుణమం♦దుం గుంద సంఫుల్లహా
లలనుం బోలుచు నొడ్లయూరువులఁ బో♦ల్పం గాక ద్వంద్వాత్మతన్
జెలఁగున్ హరలయూరుయుగ్మకము ల♦చ్ఛిద్రప్రభావంబునన్.

తే. గీ. అరయ గతనిజలాభంబు ♦ లయ్యె నెపుడు
స్వాశ్రితేందిర కధికసు♦ఖాళి స్వాశ్రి
తాంబరంబున కతివికా♦సంబు నొసఁగు
హరితొడలు వైశ్యజనకంబు ♦ లగుట యెట్లొ. ౨౬3

తే. గీ. వరసువర్ణవర్ణాంబర♦భాసి రుక్మి
ణీముకుందకటిద్వయ ♦ మోము మన్మ
థంగసాంద్రసంధ్యాఘన♦సంగతశిఖ
రోల్లసద్ధేమనీలగి♦ర్యుపమితంబు. ౨౬౪

తే. గీ. అమలపీతాంబరాంచిత ♦ మగ్ర్యరత్న
ఖచితరాజితకింకిణీ♦కాంచికాది
జాతకాంచియు నై యొప్పు♦శౌరిపీన
సన్నితంబ మెన్నుము మాన♦సను నిరతము. ౨౬౫

తే. గీ. రమ్యమేఖలాశ్రితరత్న♦రాజికాంతి
తరళకాంతిభారంబునఁ ♦ దగి వినమ్ర
మయ్యెనో యనఁ దగి రమా♦బ్జాక్షినీవి
కాంతు లాపాదపద్మంబు ♦ గా వెలుంగు. ౨౬౬

చ. వ్రజభువి నెన్నిరజ్జులకు ♦ బద్ధము కానిజనార్దనోదరం
బు జలరుహాక్షి రుక్మిణి స♦ముత్ప్రిసరత్నపలకాళిశోభి యూ

నిజభుజపన్నగపాశమున ♦ నేర్పునఁ గట్టఁగఁ జాలెఁ జక్కఁగన్
యజితుఁడ యయ్యుఁ బ్రేమ మను♦ప్రాంచదుదారసుదామపాశిక౯.

క. హరివళి రాజిల్లెఁ బ్రిథో
దరగతమై యంకగతసు♦ధాకంధిసుతా
స్ఫురితకరోచ్చాంగుళికాం
తి రహిం జెలఁగెడు ననంగ ♦ నిఖిలస్తుతమై ౨౧౮

హరిసూక్ష్మరోమలత త
ద్వరనాభిం జొచ్చి వెడలి ♦ పైఁ బ్రాఁకెడుసం
స్ఫురదబ్ధిజాకటాక్ష
శ్ఛరరాజిం బోలి వెలిఁగెఁ ♦ గడుఁ జిత్రముగా౯. ౨౧౯

తే. గీ. మహిమ స్వర్ణవర్ణోదర♦మధ్యలగ్న
శ్రీమనోజ్ఞరోమావళి ♦ చెలఁగె నరయ
నతులకుచకుంభికుంభయు♦గావతీర్ణ
మైనమదవారిధారయో ♦ యనఁగ నొప్పి. ౨౨౦

మ. తనురోమావళినీలరత్నలత కాం♦తానాభివాపీతటీ
దనరం బుట్టి లసత్కుచాచలతటీ♦ద్వంద్వాంతరం బొందఁ బో
వ నభోవ్యాప్తి నలబ్ధమధ్యసరణి౯ ♦ బ్రహ్మార్పితస్నిగ్ధకాం
చనసద్యష్టియొ నాఁగఁ దద్వళి నమం♦చత్త్రివళీమం బొల్పెడు౯.

తే. గీ. తగ సముద్దీప్తహారమ♦ధ్యగతరత్న
నవ్యకాంతిహృద్యము మనో♦జ్ఞలసదుదర
బంధబద్ధంబు చంచత్త్రి♦వళియుతంబు
వారలక్ష్మీశోదరంబు శు♦భప్రదంబు. ౨౨౧

మధ్యాక్కర. తనర గర్భస్థితవిశ్వ♦తతు లమ్మాఁ బ్రద్యుమ్నముఖ్య
జనకు లిప్పుడు భీష్మసుతయు ♦ శౌరియు నను బు సూచించు

ననువున విశ్వమందిరము ♦ నయ్యు మన్మథగాత్రమాత్ర
మును ధరించినవారిమధ్య♦ము ముదంబు నిచ్చుత మాకు. ౨౨౩

మధ్యాక్కర. కనఁగ సత్తర్కమాత్రైక♦కలితంబు సకలాపవర్గ
మునునయి హరినాభివివర♦మున నుండి పుట్టినగగన
మున కూర్ధ్వభాగంబునందుఁ ♦ బొనరి పద్మోపభోగ్య మగు
ఘనపరిణామం బనంగఁ ♦ గాంచెఁ దన్మధ్యంబు ఖ్యాతి. ౨౨౪

చ. వనధిసుతాముకుందతను♦వర్తులమధ్యము శిక్షితాత్ముల
య్యును గవు లెల్ల రెప్పుఁ గల ♦ దో మఱి లేదో యటంచు సందియం
బునన గణించు చుండుదురు ♦ బుద్ధిఁ జువ్వా యది కారణంబుగా
జనములు సందియం బనఁగ ♦ సంజ్ఞితమై తనరారు మధ్యముల్.

తే. గీ. విభునిమృదులమనోజ్ఞసు♦వృత్తమధ్య
భూమి యొప్పెడు లక్ష్మి య♦తూర్పుత్రివిధము
మదిని భావించి హస్తప♦ద్మమున సంత
తంబు నాశ్లేషశీలయై ♦ తనరు చుండు. ౨౨౬

తే. గీ. అఖిలవర్ణ్యలావణ్యగు♦ణైకధామ
మంబుజాక్షునురంబు చి♦రంబు మిగుల
నల సపత్నీచయకుచల♦క్ష్మాంక మయ్యు
దాని విడువక లక్ష్మి స♦దా వసించు. ౨౨౭

చ. తతపరిరబ్ధభీష్మకసుతా♦కుచకుంకుమలక్ష్మలక్ష్య మా
దితిసుతశత్రువక్షము స్వ♦తేజము చేత జయింపఁ గల్గె సం
తతసమదస్ఫురత్పరిణ♦తద్విపధాతుసురక్తకుంభల
క్ష్మితతియు తేంద్రనీలనగ♦చారువిశాలతటంబు నెంతయున్. ౨౨౮

తే. గీ. కౌస్తుభోద్భాసితంబు శ్రీ♦కామినీగృ
హంబు చందనచర్చితం♦ బతివిశాల

మింద్రనీలనీలంబు వి • స్తృతవిభూష
ణాళి విశ్రులువక్షంబు • నమరఁ దలఁతు. ౨౮౦

మ. పురుషోత్తంసునురోనులేపమణియై • పొల్పొందు గంధంబునం
గరముం శోభితమై చెలంగు కఱులా • కాంతాకుచద్వంద్వ మా
ధరసౌవర్ణసురమ్యపూర్ణకలశ • ద్వంద్వోపమానంబు సుం
దర ముత్కృష్టతఁ జెందుఁ గావుతను హృ • ద్యం బద్భుత ప్రౌఢిమన్.

తే. గీ. లలి సమాచ్ఛాదితస్వమూ • లప్రదేశ
మారమా స్తనయుగమున • కఖిలధర్మ
గోష్ఠ యాశౌరి కర మిచ్చెఁ • గూర్మి నట్టి
స్తనయుగంబును వర్ణింప • శక్యుఁ డెవఁడు. ౨౮౧

తే. గీ. శుద్ధమందస్మితామృత • శోభిబింబుఁ
బూర్ణ నమలమనోజ్ఞాస్య • పూర్ణచంద్రుఁ
జూచి ధరియించె యువతి వ • క్షోజయుగము
సతతముకుళితపద్మకో • శములకాంతి. ౨౮౨

చ. సమము సువంశజాతమును • సద్గుణశోభి సువృత్తరత్నమై
యమరియు నవ్యహారికసు • హారము పీనకుచాకుచంబులం
దమరఁగఁ బొంద నేర దిసు • మంత ఘొడంబును వృత్తశీలవం
శము లవి తేజరిల్ల విట • మాన్యగతిం గఠినాంతికంబునన్. ౨౮౩

మ. అని శార్ఙ్గగ్రహణంబునందును గుణా • శాకృష్టి నారాచధా
రణసంధానములందు మాధవచతు • ర్హస్తాబ్జముల్ పొల్చి కా
ముని కేళిన్ గమలాకచగ్రహమునన్ • బొల్పొపరీరంభమం
దును గండగ్రహణాధరక్షతముల • తోఁచుం బ్రవీణంబులై.

చ. తలఁపఁగఁ బ్రస్ఫురన్మరక • తద్యుతులున్ నఖరమ్యహారికం
బులు నతిదీర్ఘముల్ విభుని • పూజితహస్తము లెన్న నాలుగున్

ఫలితసుపుష్పితాగణిత వైభవశోభితపారిజాతశా
ఖలగతి నొప్పుచుండు నత కామితసత్ఫలప్రదంబులై. ౨౮౫

తే. గీ. శౌరిచక్రము హతదైత్య చక్ర మతని
శంఖము స్వనధిక్కృతశత్రు శంఖ మతని
పద్మ మది ధ్వస్తపరముఖ పద్మ మింక
నతనిగద యది పాపగ దాపహంబు. ౨౮౬

తే. గీ. శత్రుల కసహ్య మయ్యె ని జప్రహర్ష
దం బగుటఁ జెల్లెఁ దదసి నందక మనంగ
విరహిణీతాపదుండ యయ్యె విశ్వమునకుఁ
జంద్రుఁ డానందకరుఁ డౌట నందియంబె. ౨౮౭

తే. గీ. శరములనపారముల శత్రు సంఘదైన్య
కారి యయ్యెను ద్రిసతంబు శౌరిచాప
మల్లె సద్వంశభవులు గుణాఢ్యు లరయ
నన్ని వేళల నతులు సమగ్రు లయ్యె. ౨౮౮

చ. ఘనవలయాంగులీయమణి కంకణదీప్తుల వెల్గుచుండె సుద
ర్శనసుగదాబ్జశంఖముల రాజిలి వర్తులమై త్రిరేఖశో
భనమణిబంధకాంతివిభ వంబున శోభిలి శోణపద్మభం
జనతలరంజితం బయిన శౌరికరాఘము మమ్ముఁ బ్రోచుతన్.

తే. గీ. అరయఁ బూర్ణమనోరథుఁ డయ్యె వేని
బంధమును గోరి మఱచు సర్వంబు నట్టి
సంధిజాక్వణత్కటకకం కణముఖవర
భూషణాంచితకరములు ప్రోచు మమ్ము. ౨౯౦

తే. గీ. వృత్తములు త్రిరేఖంబులు వివిధరత్న
దీప్తములు నగుశ్రీశ్రీశ దివ్యకంధ

రములు గెల్చు విష్వక్సేన♦రత్నచిత్ర
ము లగుశంఖ శేవధులను ♦ బోనర మహిమ. ౨౯౧

తే. గీ. రత్నలసితపరిశ్రిత♦రమ్యచిత్ర
భూషణవికాసితము వృత్త♦మును త్రిరేఖ
మును విమలహారజుష్టంబు ♦ వనధిజేశ
కంఠ మది స్మరణీయంబు ♦ కడఁక నెపుడు. ౨౯౨

మ. సరసేందీవరమల్లికాప్రవిలస♦జ్జాతిస్ఫురచ్చంపకా
ధ్యరుణాశోకమృదుప్రసూనరచితం ♦ బబ్జాగ్ర హూకృష్ణవా
ల రహిం దద్గళగ్న మాకనకనీ♦లస్ఫారముక్తాబ్జరా
గరుచిప్రోజ్జ్వలదబ్ధిజాకరలతం ♦ గా నెన్న నా నారయన్. ౨౯౩

తే. గీ. బంధవిరహిత యయ్యును ♦ సింధుసుతకు
నతులమాంగళ్యసూత్ర మొ♦ప్పారె నిత్య
బద్ధమై ముగ్ధకామినీ♦భవ్యకంఠ
యోగ మది గల్గ మోక్షమే ♦ నొల్లరు కద. ౨౯౪

ఉ. మంగళదేవతాబ్జదల♦మానితనేత్ర ధరించినట్టి స
న్మంగళసూత్ర మద్భుతస♦మంచితనీలమణిప్రశోభి త
న్మంగళకంఠమున్ విడిచి ♦ మానుగఁ బాయఁగ లేదు మున్ను త
త్సంగతిఁ బాయ నేరదిఁకఁ ♦ దద్దయు నిప్పుడు పాయ దెన్నఁగన్.

చ. నిజహరిణంబు దూరమున ♦ నిల్పి తదీయవిలోచనంబులన్
నిజసితబింబమందుఁ గడు ♦ నేర్పునఁ జంద్రుఁడు నిల్పెఁ గాక యా
విజయిశుచిస్మితాఖ్యము సు♦వృత్తము లోలవరాలకంబు నం
బుజనిలయాస్యమున్ లలిత♦మోహననేత్రముఁ బోల నేర్చునే.

తే. గీ. గణ్యమాణిక్యశోభి ము♦ఖము సదాంత
రనిశఘోషాగమభాసి ♦ రమ్యమౌక్తి

కంబు మానార్హనీలాశ్మ♦కంబు నగుక
రండమును గెల్చు శ్రీనాథు♦గండయుగము. ౨౯౭

మధ్యాక్కర. అమలచంద్రోపమితంబు ♦ నఖలసౌఖ్యచయప్రదంబు
విమలసౌందర్యదుగ్ధాబ్ధి♦ఫేనకల్పం బోష్ఠకాంతి
రమణీయతర మగునింది♦రానాథుమందస్మితంబు
రమణ మాయఘపాళి నడఁచి ♦ రక్షించుఁ గావుత మెపుడు.

చ. అమలము కోమలాచ్ఛదర♦హాసదశాకలితైకదేశ ము
త్తమకమలాకపోలలలి♦తక్షతకారణభూత మచ్ఛరూ
పము వరకుందకుట్మలని♦భంబు గదుఁ నిబిడంబు యాదవో
త్తమురదనాళి నాదుమది ♦ ధ్యానము సేయుదు సర్వకాలముఁ.

తే. గీ. మహితసన్మాన్యలావణ్య♦మధునిబిడము
సలలితామ్లానచంపక♦సంపదంచి
తంబు లసదున్నతాగ్రంబు ♦ దైత్యరిపుని
సరసనాసాపుటము మాన♦సమునఁ దలఁతు. 300

మధ్యాక్కర. నుతము వ్యక్తాతికోమలమ♦నోహరవర్ణపూర్ణంబు
శ్రుతిచయార్థసువృత్తి మధుర♦శోభనస్వర మత్యగాధ
మతులితక్లేశదుర్విషశ♦మామృతవర్షకల్పంబు
శ్రితు నన్ను నిజతత్త్వ మెఱుఁగఁ ♦ జేయుత హరివాగ్విభవము.

మధ్యాక్కర. నానావిధానుపమమణి♦నానావిధవిచిత్రలసిత
మీనోపమోజ్జ్వలకనక♦మిహిరాభకుండలయుతము
శ్రీనాథుకర్ణయుగళము ♦ శ్రీసుభగము వినుఁ గాత
దీనభవార్తమత్స్తుతు లు♦దీర్ణత పతతంబుఁ బ్రీతి. 30౧

శా. అంభోజాతవిశాలకోమలసుదీ♦ర్ఘాంచత్సుపత్త్రిప్రభా
సంభావ్యంబును సంచలన్మధుకరీ♦జాతోల్లసత్తారముఁ

శంభుసఖీశపతిముఖ్యవాంఛితకటా◆క్షశ్రీవిలాసంబు ను
జ్జృంభిశ్రీధరనేత్రయుగ్మము నిరీ◆క్షించుత నన్ం బ్రీతితో. 303

చ. వరకుటిలాలకంబు మణి◆వర్గమయోజ్జ్వలపట్టబంధముల్
దరలసితాలికద్వయము ◆ శిద్ధ కురంగమదాత్తపుండ్రభా
సురము విశాల మాదితిజ◆సూదనుదివ్యలలాట ముల్లస
త్కరుణ మదీయఫాలలిఖి◆తం బొనరించు శుభప్రదంబు గాన్.

తే. గీ. శ్యామము త్రివక్రము విధిము◆ఖ్యామరేశ
రాజిసామ్రాజ్యదానకా◆రణసులీల
మంగజాగ్ర్యచాపాకృతి ◆ యంగజాత
జనకుభ్రూమండలము ప్రోచు ◆ సరవి మమ్ము. 305

ఉ. ఏయధరంబునుండి జని◆యించురసంబున లుబ్ధచిత్తయై
శ్రీయువతీలలామ యదు◆సింహునివక్షమునన్ వసించు నె
న్నేయధరంబు వేణువున ◆ నెప్పుడ నుండెడు నట్టియామ్రవా
శాయత కాంతిహృద్యదువ◆రామలమృద్వధరంబు వొల్చెడున్.

చ. అమరనగ దేనియం గుదిత ◆ మానమృతంపునగణంబునన్ ఘణీం
ద్రమృదులశయ్యా నిత్య మజ◆రామరణుం డగుచున్ సుఖించు శ్రీ
రమణుఁడు పక్వబింబసమ◆రమ్యతమం బగునట్టిసాత్త్వికో
త్తమదయితాధరోష్ఠము సదా నను జేయుత సంపదన్వితున్

చ. సరసుఁడు దేనిచుంబనము ◆ సల్పుటఁ గృష్ణుఁడు నిత్యతృప్తుఁడై
పరఁగు గతాన్యతృష్ణుఁ డయి ◆ భానురకుండలరంజితంబు స్వ
ర్ణరచితరమ్యసత్ఫలక◆రాజనిభం బగునట్టియారమా
తరుణికపోల మర్మిలి స◆దా నను జేయుత సంపదన్వితున్. 308

తే. గీ. అతులవశ్యాగ్రహారత్తర◆సాతురంబు
ప్రియవశీకరణోచిత ◆ మయినసకల

యంత్రవరమును బోలెడు♦వట్టిదళన
పదయుతరమాకపోలంబు ♦ ప్రభల మించు. ౩౦౯

తరువోజ. అంతర్నిగూఢ హే♦మాంకురితాన
నాంచితర బయ్యె ము♦రాసురవైరి
కాంతామణీనాసి♦కాభూషణమణి
కనఁగ ముక్తామయ♦ఖ్యాతి వహించె
నింత గాదే యది ♦ ప్రియవధూభవ్య
విశదపీయూషార్ద్రి♦విమలోష్ఠబింబ
సంతతచుంబన♦సద్భాగ్యులకును
జగతి నెం దామయ♦సంగతి గలదె. ౩౧౦

మధ్యాక్కర. అమలముక్తాత్మక మయ్యె ♦ నతివనాసాభూషణమణి
సమృదుతాకాబ్ధిజోత్థాను♦ష క్తయై తదపాంగబాణ
సమితిభిన్నం బయ్యె విడిచి ♦ చన లేక పరిలంబి యయ్యెఁ
దమి నింక హరి వశ్యుఁ డగుట ♦ తగ ససాధ్యంబే తలంప. ౩౧౧

తే. గీ. వినుతనాసాఖ్యచంపక♦భీతిచలిత
మీనకాంబుజాతార్పిత♦హృత్సముత్సు
కం బధరజపంబు భృం♦గతతిసంప
దను యదుపరాజ్యపాంగంబు ♦ తద్ద గెలుచు. ౩౧౨

మ. హరి హేమాంగిని నీలరత్నసదృశా♦పాంగిన్ బ్రవాలోల్లస
చ్ఛురణన్ సుస్మితమౌక్తికన్ మరకత♦స్కంధాభవేణ్యాఖ్య సుం
దరి నైడూర్యనఖన్ నఖక్షతలస♦న్మాణిక్యపుష్పన్ వరా
ధరగోమేద రదోచ్చవజ్రఁ దగఁ జెం♦దం జేయఁ డాస్వర్థ్వివున్.

చ. కలికిమనోజ్ఞకాయమునఁ ♦ గార్శ్యము లంబితదైర్ఘ్య మెన్నఁ గుం
తలములఁ జేతులం మటి క♦ర్ణగను లందును మధ్యమందు నూ

రుల నతిచంచలత్వము ని॥రూఢి నదృశ్యత మార్దవంబునుం
* గల విభకుంభరుగ్విజయి॥కంధినుతాకుచసీమ లేని వా. 3౧౪

తే. గీ. లలి రమాహారి(భ్రూమధ్య॥లగ్నమృగమ
దీయతిలక మొప్పారె న॥ది వికసోప
లోపరిగతంబుఁ గందర్ప॥చాపలగ్న
మయినయసితోత్పలాస్త్రంబు ॥ ననుకరించి. 3౧౫

తే. గీ. నిరతమును బరస్పరమనో॥హారికీర
సంగమున మత్తషట్పదా॥భంగకాంతి
నెంతయును ఫుల్లపంకజ॥కాంతి లసిత
ములు రమాశౌర్యపాంగముల్ ॥ ప్రోచు మమ్ము. 3౧౬

చ. విమలకిరీటభానుఁ గని ॥ భీతి నధోముఖలంబమానమై
యమలముఖేందునిం గని భ॥యంపడి యున్ముఖమై యరాతిమ
ధ్యమున భ్రమించుయోధుగతిఁ ॥ దల్లడమందుతమంబు నాఁగఁ ద
ద్భ్రమిపదలకాళి కర్ణయుగ॥భాగసితోత్పలకాంతి దాఁగెడున్. 3౧౭

ఉ. శ్రీకలితంబు నీలచమ॥రీమృగవాలభరాభముల్ స్ఫుర
చ్ఛ్రీకరరత్నసన్ముకుట॥సేవితముల్ మతి యుల్లసత్సుమా
ఘాకర ముజ్జ్వలంబు నగు॥నాకమలాచ్యుతమౌళిదేశముల్
జోక నుతింతు సంతతము సుస్థిర॥భద్రము కోరి భక్తితోన్. 3౧౮

వ. ఏతాదృశానన్యసామాన్యాగణ్యలావణ్యప్రావీణ్యాంచచ్ఛరీర లగు
నకారణశరీరు లమందానందంబుల సౌఖ్యవార్ధి నోలలాడు నెడ.

( వసంతర్తు వర్ణనము. )

పంచచామరము. అనన్యయోగ్యశోభిగ ॥ యాటఁ గృష్ణునానతిన్
వినోదరీతి మూలలక్ష్మి ॥ వేగ మూలమాధవం

* ఇది వివమనమ్మస్వాపూరణము.

బునఁ బసిరమాత్మగర్వ♦ముఁ బహించె మాధవం
బునఁ రమేశుప్రీతికై వ♦ముత్సుకత్వ మేర్పడఁ ౩౨౦

తే. గీ. మాధవాగమమున మూల♦మాధవగత
మైననిజమూలవరలక్ష్మి ♦ నంతఁ దనదు
బుద్ధిఁ దెలిసి క్రీడామాధ♦వుం డచటికి
నరిగె వేడ్కఁ గ్రీడాలక్ష్మి ♦ యనుగమింప. ౩౨౧

తే. గీ. అనిలమర్దితఘుస్మబిం♦ద్వంగుఁ డగుచు
హేమచార్వంబరుం డంబు♦జేక్షణుఁడు ప్ర
సూనమృద్వంఘ్రిఘితలుఁడు శ్రీ♦శుండు గనియె
లలిని రమణీయమాధవ♦లక్ష్మిఁ జెంత. ౩౨౨

సీ. వరబర్హిబర్హాళిఁ ♦ బ్రసవాననాంచిత
నలికులోత్ఫుల్లాల♦కాళిలసిత
సత్పల్లవప్రాంత♦శాఖాభుజను మజి
లతికామృదులగాత్రి ♦ లలితశోభ
రక్తవర్ణాంబరా♦వంజిత మాద్యత్పి
కాఘనుస్వనను శు♦కౌఘవాక్య
చాటువు వరపలా♦శప్రసూనాధర
బుతుమతి గ వనదే♦వత నెఱింగి
ప్రణయకోపలజ్జాభర♦వతియయి పతి
మోముఁ గనురుక్మిణిని దేర్చి ♦ ముద్దుగొనియె
సీతలం బిది యుత్ప్రేక్ష♦ణీయమ కద
యీావె కావె తద్రూపంబ ♦ వింతి యనుచు. ౩౨౩

తే. గీ. కుసుమసంచయకంపన♦కుసుమనోజ్ఞ
నజలశీకరదక్షిణ♦సలలిత ని

లవ్యజనపాణియై వేడ్క♦లలి వనరమ
మనుజమానసమండను ♦ ననుగమించె. ౩౧౪

తే. గీ. సకలదర్పకదర్పకా♦స్త్రాయితంబు
లగులసత్సహకారస♦వాంకురముల
స్మరరహస్యమంత్రోత్కార♦జపముల నన
మందరుతములఁ గోకిల♦బృంద మొప్పె. ౩౧౫

తే. గీ. మాన మిత్తటి తగ దిఁక ♦ మానుఁ డనుచు
నబ్జవదనాధరామృతం ♦ బానుఁ డనుచుఁ
గాంతలకుఁ గాంతులకుఁ దెల్పు♦కరణి నొప్పెఁ
గుసుమచుంబనకృద్భృంగ♦కులరుతములు. ౩౧౬

తే. గీ. పథికయువతి మరుత్స్పర్శ♦పథమున విర
హార్తి నలికులాలికులాళి ♦ యనిలుఁ గూడి
యరిగి పతిమ్రోలఁ దనయార్తి ♦ నమరఁ దెలుపుఁ
గాక యను చక్షువులఁ జల్లె ♦ గాలిత్రోవ. ౩౧౭

తే. గీ. మధునియుక్తభుజంగాళి ♦ మదనరుచిర
మైనయోషిత్స్తనమున న♦వీనశివుని
వ్రాసె నన నప్డు నఖపద♦రాజకళను
మాఱియు వసనచ్యుతిని మృగ♦మదముచేత. ౩౧౮

తే. గీ. అసితకంతతఁ గరయుగ♦శాంబుజాత
వేష్టితసుమూర్ధతను వ్యాన్ని♦వేశనంబు
నమర సమదృశ్యతను జిష♦తాంతవదన
ములను రుచిరత రచియించె ♦ మొగిని వేడ్క. ౩౧౯

ఆ. వె. మదనవహ్నిసఖుని ♦ మఱి ప్రియశీతలు
సహావహ కుసుమగంధ♦వహు ననిలునిఁ
దద్ద గొలిచిరి సుర♦తగ్లానముఖు లుప
రతమనోజరణులు ♦ రహి జనములు. ౩౩౦

తే. గీ చిత్రమె వసంతవేళలఁ ♦ జిగురుఁబోండ్ల
కౌఁగిలింతలఁ గోరుట ♦ కడఁక నరులు
తరువులును సరాగంబులై ♦ తద్గ వాయు
చలితతనులతాపరిరంభ♦ముల వెలయఁగ. ౩౩౧

శా. తనరం జెంక జనించు వీరి కని చెం♦తన్ వారిఁ బూజించి పా
వనదాక్షిణ్యముఁ గోకిలాళిమధుర♦త్వంబుం బ్రవాలాలినూ
తనరాగంబు శుకప్రియోక్తు లలిగీ♦తంబుల్ మధుస్నాన మ
ర్చనముల్ సత్సుమరాజి ఛత్త్రము తరు♦చ్ఛాయల్ వసంతుం డిడెన్.

వ. ఇవ్విధంబున నమ్మాధవుండు సుధాపాథోధిసుతాసమేతుం డయి
యమ్మాధవవేళం గ్రీడించుచుండ నంతఁ గతిపయదినంబులకు. ౩౩౩

(గ్రీష్మర్తు వర్ణనము.)

తే. గీ. మహితనిజబలకరదీప్తి ♦ మఱుఁగుపఱుచు
మూలమాధనమాధవ♦శ్రీల నడఁప
నెఱిఁ గడిమిఁ బొల్చె గ్రీష్ముండు ♦ నిజహితార్థ
మొనరఁ మాధవుఁ డయ్యుప♦వనము సేరె. ౩౩౪

చ. అల వనమాధవుండు తప♦నాధికకాంతి జయింప గ్రీష్ముఁ డ
ప్డలుక వసంతపుష్పనివ♦హంబును శుష్కముఁగా సమీరునిన్
లలి నతితప్తుఁగా నలికు♦లంబును జంపకకంపితంబుఁ గాఁ
జెలఁగి పికాదిపక్షితతి ♦ క్షిప్రము మూకను గాఁగఁ జేసె హా..

మధ్యాక్కర. అరయంగ శీతలోదకము ♦ నల యనుష్ణాశీతధరణిఁ
గరము భానుకరోష్ణితములఁ ♦ గావించి గాలి నూర్ధ్వగతిఁ
దిరుగఁ జేసి త్రివృత మయ్యె ♦ దేహ మమ్మాత్రపాత్రముగ
సరగఁ జేసి దవాగ్నిఁ బెంచి ♦ జలము నింకించె గ్రీష్మండు. ౩౩౬

తే. గీ. అల నిదాఘభయంబున ♦ ననఁగ శివుఁడు
గంగఁ దాల్చె రమాపతి ♦ కంధిఁ జేరె
సరయుఁ బంకజవిష్టరుం ♦ డయ్యె నలువ
యాహహా పరు లోర్తురే నిదాఘాతపంబు. ౩౩౭

తే. గీ. అప్పుడును సిద్ధు లలఘుపం♦చాగ్నిమధ్య
మునఁ బ్రహృష్టరోమాఘులై ♦ కనులు మూసి
కొనుచు ధ్యానింతురు ఫలము ♦ కోరువారి
కరయఁ గలదె యసహ్యమం ♦ దైన నహహ. ౩౩౮

తే. గీ. గాలి కృష్ణపదాబ్జము♦గ్గంబు నిచటఁ
దాఁకుచు సుశీతలుం డగు ♦ దానవహ్ని
నుజ్జ్వలంబుఁ గా నచ్చట ♦ నొనర లేపుఁ
జపలులస్వభావ మిది కాదె ♦ సరవి నెందు. ౩౩౯

తే. గీ. నాగరులు గిరికుంజగ♦ణంబుఁ జేరి
తగఁ బ్రియాపయోధరకుంభ♦తటిని గాఁగి
లించి తదధరామృతము సే♦వించి తాప
మును బిపాసయు నార్తురు ♦ ముదము మీఱి. ౩౪౦

తే. గీ. తనర శ్రీకృష్ణముఖచంద్ర♦దర్శనమున
నెలమిఁ దద్దృష్టిపీయూష♦వృష్టివలనఁ
దపనుతాపంబు నెఱుఁగక ♦ ద్వారవతిని
జనులు సుఖియించు చుండిరి ♦ సౌఖ్యవృద్ధి. ౩౪౧

## (వర్షర్తు వర్ణనము.)

వ. ఇవ్విధమునం దపనగ్రీష్మలు విజృంభించి యుండునంత. ౩౮౨

తే. గీ. జలదగణము సవర్ణుఁ డౌ • జలజనయను
నకు సహాయార్థ మేతెంచె • నా సమీప
గం బయి నిజాంగముల భానుఁ • గప్పి గ్రీష్మ
జలములను గప్పి పోషించె • జగము నెల్ల. ౩౮౩

తరువోజ. ధర నెన్న విష్ణుప • దం బాశ్రయించి
తెగ నర్థులకు వారి • ధారలు గురియు
సరళిఁ దౌఘునునకు • జడనాయకుఁడును
సారథ్య మొనరించుఁ • జాలఁగా నెపుడు
నిరతంబును ముకుంద • నిర్మలచరణ
నీరజాశ్రితసర్వ • నిజవిభవునకుఁ
బరికింప నుపకార • పరునకు నెందుఁ
బరఁగ సాహాయ్య మొ • వ్వఁడు సేయఁ డొక్కొ. ౩౮౪

ఉ. భావన సేయ శోకహర • వారి జగంబుల కెల్ల నిచ్చు మే
ఘావళికిం గదుర్ విమతుఁ • డయ్యును దక్షనయోగకారిగాఁ
జూపె సమీరుఁ డొప్పెఁ దగఁ • జోకఁ బరోపకృతిప్రలగ్నస
ద్భావుల కెందు శత్రులు ను • దారశుభావహు లౌట చిత్రమే.

మ. వరవిద్యుల్లతి వక్రశక్రధను వా • ప్పన్ ఖాశ్రయంబై పయో
ధర ముద్గర్జల వర్షముం గురియ భ్రాం • తస్వాంతులై భీతిఁ జెం
దరు లోలాక్షికటాక్షముల్ బొమయు స • న్మధ్యోర్ధ్వ గాంచత్పయో
ధరముల్ వెంచి క్వణత్సుభూషణతతిన్ • దా రొందుటల్ మాన
వుల్. ౩౮౬

చ. జలకణమాత్ర మంబుధి యొ♦సంగ సరిత్తతికిం బయోధికిం
జలముల వృద్ధిగా ఘనుఁ డొ♦సంగెను విష్ణుపదాశ్రయుండు నె
ష్ఠిల నుపకారి యౌనరున ♦ కింత యొసంగినఁ గోటిగుణ్యమై
వలనుగ దాతఁ జేయదె స్వ♦వర్గముతోఁ దగ వృద్ధి గాంచఁగన్.

తే. గీ. గ్రీష్మసత్త్వ మసహ్యమై ♦ కేఁగియు వడి
నంబుదాగమమహృత మయ్యె ♦ నదియు యుక్త
మమర సర్వంసహాజీవ♦నము హరించు
వానితేజంబు నిరతంబు ♦ పఱలఁ గనునె. ౩౮౬

( శరదృతు వర్ణనము. )

సీ. అలసాధుజనమాన♦సాకృతి సరసులఁ
దగఁ బరిశోధించి ♦ తద్వదనని
భాంబుజచయముఁ బ్ర♦హర్షంబు నొందించి
మించి పంకంబు ఖం♦డించి మఱియుఁ
దగ్ధ్రన్నభోగతిఁ ♦ దనరునభంబు ఘ
నాపిధానరహిత ♦ మగుటఁ జేసి
యలఘుతమ మడంచి ♦ హరివీర్యకీర్త్యాభ
సూర్యోడువులకాంతి ♦ స్ఫుటము సేసి
యతులసంసారబంధంబు ♦ సనఁగ భిక్షు
వణిజులకును బ్రావృట్కాల♦బంధనమును
సరగఁ ద్రెంచి మోక్షానంద♦సత్ప్రవాహ
తులితగోక్షీరవరపాన♦ముల జనములఁ. ౩౮౭

తే. గీ. ముదితులుగఁ జేసి. సచ్ఛాస్త్ర♦మునకు నుద్ది
నై సముజ్జృంభితం బగు ♦ చమరోఁ జూడ

సతులవరశరత్సామ్రాజ్య ♦ మంత ధరణిఁ
గరము సకలజనానంద ♦ సరణి నొప్పె. ౩౯౦

సీ. గణితపద్మాసేవ్య ♦ గుణరాశివిస్తృతి
కారి స్పష్టీకృత ♦ శారదైక
ఘనసదానందుండు ♦ కంపితభోగిరా
ణ్మార్ధసన్మాన్యాగ ♦ ముండు మఱియు
సన్మార్గసంశ్రితాం ♦ చత్పంకశోషణ
కరుఁడును సత్పాంథ ♦ ఘర్మహరుఁడు
నొనర విష్ణుపదాశ్రి ♦ యుండును బరిలస
త్పుణ్యాంబుపూతుం డ ♦ గణ్యసుఖదుఁ
డనవరతము రామాయోగి ♦ జనుల కరయ
భీమచరితుండు సద్వంశ ♦ వితతి నెపుడు
స్వాగమమునఁ బ్రేమాలంబ ♦ నైకశబ్ద
హృద్యసదనంబుగాఁ జేయు ♦ నిద్ధకీర్తి. ౩౯౧

తే. గీ. సుమనసాళికి సుక్షేమ ♦ మమరఁ గూర్చు
పుణ్యుఁ డక్షితి సువ్యక్త ♦ మూర్తి మాఘు
తుండు సచ్ఛాస్త్రఘుండు స ♦ ద్గురుని బోలి
సేవ్యుఁ డవ్వేళ మూర్ధాభి ♦ షిక్తుఁ డయ్యె. ౩౯౨

( హేమంతర్తు వర్ణనము. )

తే. గీ. పతివియుక్తనాకీముఖ ♦ పద్మములను
బద్మతతితోడ శిథిలనై ♦ పరఁగఁ జేసి
యుల్లప్రబోధకల్పకు రవి ♦ నల్పకాంతి
యుతుఁగఁ జేయుచు హేమంత ♦ మొప్పె నంత. ౩౯౩

తే. గీ. ఇనుఁడు మన్మకరుం డయ్యె • హిమచయార్ద్ర
తాంగుఁ డౌచును స్వకరంబు • లగ్నిఁ జేర్చి
జలధిఁ దఱుచుగఁ జొచ్చెడుఁ • దలఁప నింక
సబల లెట్లోర్తురు హిమంబు • నట్టివేళ. 3౫౮

సీ. మాధవంబున మూల•మాధవంబున వేడ్క-
మాధవవనమాస•మానసరణిఁ
దగ నిదాఘమున స•దాస్వాద్వధరసుధా
స్వాదసలీలావి•నోదములను
వర్షాగమమున స•వర్ణతామైత్రి ఘ
నామర్షరహితత • ననఁగ నెలమి
సల శరత్తున మను•దాసీతసౌరభాం
చితసర్వర్తుశ్రాళి• సేచనముల
సలఘుహేమంతశిశిర వే•ళలఁ గరంబు
నిత్యనిర్భరపరిరంభ•నిరతిఁ దనరి
రుక్మిణీకృష్ణు లిల నని•రుద్ధగతుల
నంచితవిభూతితోడ ర•మించి రంత. 3౫౯

( ప్రద్యుమ్నకుమారజనన వర్ణనము. )

సీ. మారుఁ గుమారునిం • బడయ నుమాపతి
మర్త్యానుశిక్షణ•మాన్యశీలుఁ
డయిన కృష్ణుఁడు నేరి • ప్రార్థించి వరమును
బడసి రా నంతలోఁ • బడఁతి క్షైష్మి
మహితసంతోషాబ్ధి•మగ్నమూర్తి యగుచు
మోదాశ్రుధారల • మొగిని భ ర్త

చరణముల్ కడిగియు ♦ వరకాయకనకంబు
కృష్ణార్పితము సేసి ♦ కృష్ణగాత్ర
వరహరిన్మణి నిజకర♦వశము సేసి
కొని ధరించెను స్మరు గర్భ♦మునను వేడ్క
నతివ యవిముక్తకబరి యా♦సబ్జ యట్టి
కాంత యేయర్థితము లొందఁ ♦ గాంచ దొడఁగె. ౩౫౬

చ. అల గజరాజరమ్యగతి ♦ యబ్ధికుమారిక తన్వి కాంతుసే
వల మదనాత్మకంబును శు♦భస్థితిఁ దాలిచె గర్భమందు ని
స్తులితనరానుకారిచరి♦తుం డగు కాంతువియుక్తి భీతమై
కలఁగుమనంబునందును ద♦గం ధరియించెను వెంశి దానినే.

తే. గీ. మారుని గుమారుఁ గనియెను ♦ శౌరి కల జి
తారి కనురూపరూపుఁ డా ♦ నంత భైష్మి
యొనరఁ బ్రాచీనకవివిష♦యుని విశేషఁ
గాంతిశతపూరితాశు ది♦క్కాంత వ్రాలె. ౩౫౭

తరువోజ. తనచిహ్నమును జెవిఁ ♦ దన యస్త్రరాజి
దంతోష్ఠదృగ్గోష♦దమున స్వాంగంబు
తనుమధ్యమునఁ దన♦ధనువుఁ గన్బొమలఁ
దనమార్వి నీలకుం♦తలములయందుఁ
దనమంత్రి వనమాలఁ ♦ దనమిత్త్రు నాస్య
తటిని వాక్కునఁ దేజఁ ♦ దగ సమర్పించి
తనతండ్రిగాత్రంబుఁ ♦ దాఁ జేసి యతని
తనయుఁడై జన్మించెఁ ♦ దా స్మరుఁ డసఁగ. ౩౫౮

తే. గీ. విమలతారుణ్యలావణ్య♦వీర్యధైర్య
విపులకారుణ్యముఖ్యద్ర♦విణగణాఢ్యుఁ

డాకుమారుఁడు ప్రద్యుమ్నుఁ • డనఁగ నెగడె
జగతిఁ బ్రద్యుమ్నముఖ్యాంశ • జాతుఁ డగుచు. ౩౬౦

( గ్రంథసమాప్తిమంగళము. )

మ. చిర ముక్తీపతిమాలిరత్నఘటిత • శ్రీపాదపీఠుం డిటుల్
స్థిరుఁ డబ్జాసనముఖ్యఫాలలసిత • శ్రీపాదరేణుం డటుల్
వరనిశ్శ్రేయసపాంథసజ్జనమనః • పాథేయగేయోదయుం
డిర నాథుండుగఁ బొల్చుద్వారవతి మా • కిష్టప్రదం బయ్యెడున్.

తే. గీ. ఒనర మణిమంజుమాళివి • ద్యోతితాళుఁ
డాగ్యుఁ డల పురుషోత్తముం • డార్యనృతుఁడు
తతసముద్రమధ్యంబున • ద్వారవతిని
నెలయు రుక్మిణీసహితుఁడై • వేడ్క నెపుడు. ౩౬౨

తే. గీ. సకలకుశలైకగమ్య ప్ర • శస్తకీర్తి
సహిత భజకజనపుమర్థ • చయకరి పురి
యల కుశస్థలీనామిక • ద్వారక యది
నామమది నెప్పఁ జేయుత • నర్థసంబు. ౩౬౩

మ. స్వకరాంభోజసదాతపత్త్రిమును స • చ్ఛాస్త్రాఖ్యరాజ్యాప్తిఁ జి
త్సుకరాంచోళిక దాస్యమాల గళమం • దున్ హస్తయుగ్మంబునం
దిఁక స్వాంసుర్త్స్వర్ణకంకణంబుఁ బ్రభుఁ డ • బ్జేశుండు తచ్చింతనా
ధిక హేమంబు సుయుక్తిరత్నములఁ బొం • దించున్ ధరిత్రిన్ నన్నున్.

మ. అరయన్ హంసమనోహరంబు కవిభృం • గాసేవ్యమున్ భాషితో
త్కగముక్తాళి నవప్రబంధజలజా • తం బీశునంఘ్రిన్ రమా
వరపాణిన్ దివిజాంతరంగములు న • ర్పవ్యం బయ్యెడున్ శారదా
పరితోషంబు స్వహ్వాల్లనమ్మణము తా • వాయుప్రసిద్ధం బగున్.

శా. శ్రీమాంమంగళదేవి తత్పతి కథా♦శ్రీనాయికానాయకుల్
గా మాన్యం బగురంగవిఠ్ఠలకృపా♦కంధ్యంతరాప్తోక్తిర
త్నామోదప్రద రుక్మిణీపరిణయా♦ఖ్యైతత్కృతిక్ ధీమణుల్
భూమిక్ సన్మణిగొండవేంకటకృతం♦బుం బ్రోవఁగాఁ బ్రార్థితుల్.

(గ్రంథాంత పద్యములు.)

ఉ. తాక పటీర పారద సు♦ధా హిమ చందన పుండరీక పా
కారిగ జామృతాంశు శర♦దాగమనీరద మల్లి మందరో
ద్ధారియశస్సుకాంతి కల♦ధౌతధరాధర గాంగవారి బృం
దారక ధేను వాజిముఖ ♦ నారద సన్నిభకీర్తిశోభితా. ౩౬౭

క. కవివిద్వజ్జనపోషణ
ప్రవిమలచాతుర్యమృదుల♦భాషణ స్వజనా
నవరతసమ్యక్తోషణ
నవమణిరుచిలసితభూష♦ణా సుగుణనిధీ. ౩౬౮

సుగంధివృత్తము. శ్రీలసద్గృహాంగణా గ♦రిష్ఠవంద్యసద్గుణా
శీలసత్యపాలనా ప్ర♦సిద్ధకీర్తిభాజనా
తూలితాఘసంఘ ధీవి♦శాలమాళి రాజగో
పాలకృష్ణయాచభూమి♦పాల సచ్ఛుభోదయా. ౩౬౯

గద్య. ఇది శ్రీప్రసన్న పాండురంగవిఠ్ఠలారాధక
మణిగొండ వేంకటరమణకవి విరచితం
బగు రుక్మిణీపరిణయ కావ్యంబునందు
సర్వంబు నేకాశ్వాసము.

రుక్మిణీపరిణయ కావ్యము
సమాప్తము.

మంత్ర తంత్రములు:— మంత్రి రత్నాకరములు, మళయాళ మంత్రములు, సమ్మోహన శాస్త్రము, సకలమంత్రోపాసనక్రమము వగైరా.

వేదాంతములు:— సీతారామాంజనేయ సంవాదము, శుష్క వేదాంత తమోభాస్కరము, బ్రహ్మవిద్య, కైవల్యనవనీతము, భగవద్గీత, ముముక్షుజనకల్పము, భంహాసేన్ దాసు తత్వములు, వేమనపద్యములు, శివగీత, సుజ్ఞానరత్నావళి వగైరా.

ఉపనిషత్తులు:— కొలది రకములు.

సంస్కృతకావ్యములు, నాటకములు:— నీతిశాస్త్రములు, భర్తృహరి సుభాషితము, రఘువంశము ఇంకా ఇతరములు.

వ్యాకరణము, అలంకారము:— శబ్దమంజరి వగైరా.

నిఘంటువులు, అమరము:- ఆంధ్రనామ సంగ్రహము, ఆంధ్రపదపారిజాతము, గురుబాలప్రబోధిక వగైరా.

ఆంధ్రగ్రంథములు:— అపూర్వ సంఘసంస్కరణము, భారతము, భాగవతము, రామాయణము, గుప్తభావప్రదీపిక, చాటుపద్య మణిమంజరి, శృంగారశకంతాభరణము, శృంగార రసాలవాలము, శృంగార సావిత్రి వ॥

శతకములు:— కవిచౌడప్ప శతకము, కన్యకాంబతారావళి, కాళ, గుణాదర్శనము అను శ్రీ తిరుపతి వెంకటేశ్వర శతకము, పెద్దచ్చు శతకములు, టీకా తాత్పర్య శతకములు వగైరా.

కథలు, వచనములు:— నిజమైన కాశీమజలీ కథలు, కాశీ రామేశ్వర యాత్రాదర్పణము, తెనాలిరామలింగని వింత కథలు, నలుగురు పకీర్ల కథలు, మదనకామరాజు కథలు మొదలగు చాలారకములు గలవు.

నవలలు:— అనురాగవిపాకము, సుశీలామైనావతి, రాజమండ్రి, బెజవాడ, చెన్నపట్నము వగైరాలు ఎన్నోవందల నవలలు గలవు.

జీవిత చరిత్రములు: — ఆసియాఖండ విజ్ఞాన రహస్యములు, దేశనాయకుల చరిత్రలు వగైరా.

ఆనందమయములు:— పడకటింటి రహస్యాలు, సతీపతి కుతూహల రహస్యములు వగైరా.

---

చిరునామా:— ఉప్పల లక్ష్మీకాంతమ్మ, బుక్ సెల్లర్ అండు పబ్లిషర్.
జయశంకర్ అండు కంపెని; 13/79, బొడ్డు రామయ్యగారి సందు;
బుర్జుపేట, విశాఖపట్నము.

డ్రామాలు:- బలిజేపల్లి, పానుగంటి, రామనారాయణ, చక్రావధానలు, కోలాచల, చిలకమర్తి, ద్రోణంరాజు, చెన్నపట్నం, కాకినాడ, బెజవాడ, రాజమండ్రి వగైరా ప్రాంతముల ఎన్నోవందల డ్రామాలుకలవు.

కీర్తనలు:- అధ్యాత్మరామాయణము, కబీరుదాసు, భగవన్నామ, రామదాసు, హరిభజన, హరినామ వగైరా కీర్తనలు.

హరికథలు:- అనసూయ, చంద్రహాస, సావిత్రి, పెద్దదాసు, రుక్మాంగద వగైరాలు.

నాటకములు:- ధర్మాంగద, మైరావణ, సంతవేలూరు, ప్రహ్లాదలు, వీరభద్ర. రామ నాటకములు వగైరాలు.

పదములు:- కుశలాయకం, గంగావివాహము, వైకుంఠమహాత్మ్యం, శారదరామాయణము మొదలగునవి.

జంగంకథలు:- కాంభోజ, కామమ్మ, బొబ్బిలి, బాలనాగమ్మ, కుమ్మరి గుండయ్య వగైరా.

యక్షగానములు:- కపటవేశ్యా నాటకము, రుక్మాంగద, గరుడాచలము వగైరా.

పాటలు:- ఊర్మిళాదేవి. తులసిగోవిందము. పడవపాట, మేలుకొలుపులు. విచిత్ర విడికథ సవాలు. లడ్డూ. పకోడి సంవాదం చెన్నపట్నం. బెజవాడ, రాజమండ్రి. మొదలగునవి.

ద్విపదలు:- బాలభాగవతము. నలచరిత్ర. వగైరాలు.

సంగీతములు:- గాయనగాయనీయ పారిజాతము. సంగీతసర్వార్థ సారసంగ్రహము. గానవిధ్యావినోదిని. గట్టుపల్లివారివి మొదలగునవి.

వైద్య గ్రంథములు:- బాహటము. చింతామణి. ప్రసిద్ధఆంగ్లేయఔషధయోగములు. వైద్యనిఘంటువులు. శుశ్రుతశారీరస్థానం చెన్నపట్నం. రాజమండ్రి. బెజవాడ తదితర ప్రాంతముల వైద్య గ్రంధములు చాలకలవు.

జ్యోతిషగ్రంథములు:- కాలచక్రం. బృహజ్జాతకం. చెన్నపట్నం. బెజవాడ. రాజమండ్రి. కాకినాడ తదితర ప్రాంతముల వగైరా ఎన్నోకలవు.

ఆక్టులు, పాకశాస్త్రములు, ఫార్మలు. వర్తక మర్మములు మొదలగునవి.

---

చిరునామా:— ఉప్పల లక్ష్మీకాంతమ్మ. బుక్ సెల్లర్ అండు పబ్లిషర్.
జయశంకర్ అండు కంపెని; 13/79. బొడ్డురామయ్యగారి సందు;
బుర్జుపేట. విశాఖపట్నము.

బృహజ్జాతకము 2-0-0 గ్లేజు 3-0-0
కాలచక్రము 1-0-0 గ్లేజు 1-8-0
జ్ఞానప్రదీపిక అను మళయాళ ప్రశ్నలు వెల 5-0-0
తిలకఫల విజ్ఞానమను పుట్టుమచ్చల ఫలము 0-3-0
కేరళపంచపక్షిప్రశ్న శాస్త్రము 0-8-0
రసయోగ రత్నాకరము 2-0-0
సుశ్రుత శారీరస్థానము 2-8-0
సర్పశాస్త్రము 0-8-0
షర్బత్ పాక రత్నావళి 0-6-0

సహదేవ పశుచికిత్స 0-6-0
వైద్య శతశ్లోకి 0-4-0, 0-6-0
అనుపాన మంజరి 0-8-0
నాడీనిదానము తాత్పర్యం 0-4-0
నాడీజ్ఞానము 0-4-0
బ్రహ్మవిద్య 0-2-0
శుష్క వేదాంత తమోభాస్కరము 3-0-0
సీతారామాంజనేయ సంవాదము సం॥ శేషాచలశాస్త్రిగారి ఆంధ్రటీకా తాత్పర్య విశేషార్థ సమన్వితము వెల 3-8-0 గ్లేజు 6-0-0
కైవల్యనవనీతము 5-8-0
ధ్యానామృతం 0-6-0
సమ్మోహనశాస్త్రము అందు అదృష్ట తాజము 1-8-0
అభ్యాసన చక్రము 0-4-0

వేదాంత భక్తికీర్తనలు 0-1-0
యాజుషప్రయోగ చింతామణి 2-0-0
వ్రతచూడామణి 2-0-0
సకల మంత్రోపాసనక్రమము 0-6-0
దేవీస్తోత్రకదంబము 0-8-0
శివస్తోత్రామృతం 0-4-0
కవిచౌడప్ప శతకం 0-2-0
కల్కిపురాణము 0-12-0, 1-4-0
తెనాలిరామలింగని కథలు 0-4-0
రంగదాసు భజన కీర్తనలు 0-4-0
సుశీల మైనావతి 0-8-0
మరకతవల్లి 0-10-0
శమంతసేన 0-4-0
దొరికితివిరా దొంగ 0-6-0
నేనే దొంగను 0-8-0
విషాద వాసంతిక 0-6-0
వలపుల మడుగు 0-4-0
శకుంతల జనన నాటకం 0-8-0
వైకుంఠ మహాత్మ్యం 0-8-0
ఉషాకళ్యాణం బాణాసురయుద్ధం 0-12-0
కపటవేశ్యా నాటకం 0-10-0
మైరావణ నాటకం 0-8-0
ధర్మాంగద నాటకం (పాలుట్ల) 0-6-0
ఉషా నాటకం (తిరునగరు) 0-4-0
వీరభద్ర నాటకం త్వరకవి 0-10-0
పడకటింటి రహస్యాలు 1-0-0
ఇంకా అనేక రకములు గలవు.

☞ కాలమానపరిస్థితుల ననుసరించి ధరలు మారుచుండును.

చిరునామా:— ఉప్పల లక్ష్మీకాంతమ్మ, బుక్ సెల్లర్ అండు పబ్లిషర్.
జయశంకర్ అండు కంపెని; 13/79, బొడ్డు రామయ్యగారి సందు;
బురుజుపేట, విశాఖపట్నము.



నవీన ప్రింటర్సు. విశాఖపట్నం. 9-11-51